పశు బలమ్మెదిరించు
పశు మృగాదులు గూడ
చేతనా స్పృహ గల్గె నేని !
సింహమై పోవు ప్రతిప్రాణి !

పిల్ల మృగములు మిగుల
భీతిచే కంపించి
జాలి మోములు బెట్టి
జలజలమ్మని పొరలు
కన్నీరు మున్నీరు
గా నేడ్చుచును రెప్ప
వాల్చకను వైదేహి
వంకనే జూచినవి !
నిస్సహాయుల బ్రతుకు
లుస్సురోయని యిట్లె
కన్నీళ్ల పాలగుచు నుండు !
కరుణతో యెద పొంగుచుండు !
దుర్బలుని బ్రతుకుతో
దోబూచు లాడెదరు
నిర్భాగ్య జీవిక
న్నిరొలుక జేసెదరు

కాని ఇది తాత్కాలి
కపు గెలుపు మురిసెదరు.
చుల్కనగ కత్తినే
నాల్కతో నాకెదరు.

ప్రతి అశ్రు కణములో
బడబాగ్ని చెలరేగు
ప్రతి గుండెలోన కుం
పటి మండి పొగరేగు
పాపఫలమది పండవలయు!
పంటకై వ్యవధి కావలయు!

అసురు డంబర వీధి
అవనీజ గొనిపోగ
పెనుగాలి తాకిడికి
అనటివలె వణకుచును
పెనుగులాడుచు మొత్తు
కొనుచు నరచుచు రామ
లక్ష్మణుల బిలచుచును
రమణి కంటికి మంటి

# అంకితం

సమస్తలోక కల్యాణ ప్రదాత
శ్రీ భద్రాచల సీతారామచంద్రస్వామి
దివ్య చరణారవిందములకు

# పర్ణశాల

## (గేయ కావ్యం)



రసప్రియ
షోతేదార్ కేశవాచార్య, బి. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో
ముద్రింపబడినది.

భోజ ప్రచురణ-6.

ప్రథమ ముద్రణ : 1000 ప్రతులు

శ్రీరామనవమి డి. 3-3-1985





వెల : రు. 15-00



ప్రతులకు :

ఎఫ్. రాజశేఖర్, బి. ఎస్సి.,

ఇం.నెం. 7-6-17, చెరువు బజారు, ఖమ్మం-507 001

ముద్రణ : వియస్. ఆర్ట్ ప్రింటర్స్, ఖమ్మం.

# పీఠిక

రాముడు సీతా లక్ష్మణ సమేతుడై చిత్రకూట పర్వ
ము వదలి గోదావరీ తీర ప్రాంతంలో పర్ణశాల కట్టు
ంటాడు. ఇది వాల్మీకి రామాయణ ప్రకారము. ఈ పర్ణశాల
సిక్‌లోననా ? భద్రాచల సమీపంలోననా ? అను వివాదా
ప విషయాన్ని నా "సీతారామ తారావళి"లో 'భద్రగిరి
తము' అను వ్యాసంలో కొంత చర్చించి 'భద్రాచల
శాల'ను ధ్రువీకరిస్తూ చరిత్రకారులకు వదలితిని. ఆంధ్ర
ల్మీకి శ్రీ వాసుదాస స్వామి వారు భద్రాచల-పర్ణశాలనే
వరచినారు.

ఈ పర్ణశాల గేయ కావ్య రచనకు ప్రేరణ గావించినది
గుట్ట. అది భద్రాచల పర్ణశాల దగ్గరగల గోదావరి నదికి
ఒడ్డున ఉంది. దానిపైన రథచక్రాలకు రాపిడి వడినట్లు
పెద్ద రెండు చాఱలు స్పష్టంగా కనిపిస్తూ చూపరులను
మయ పరుస్తున్నవి. ఈ చాఱలవల్ల ఈ గుట్టకు 'రథపు
ట్ట' అను పేరు వచ్చినది.

ఈ రథపు గుట్టకు సమీపంలోనే పర్ణశాల కట్టుకొన్నార సీతారామ లక్ష్మణులు. రావణుడు సీతను దొంగిలించుటకై విమానంపై వచ్చి ఈ గుట్టపై ఆగి కొంతసేపు తగు పవ యానికి పొంచి ఉన్నాడు. ఆ విమానము ఆపు నప్పుడ దాని చక్రాలకు రాపిడి కలిగి చాలలైనాయి. ఆ రథ చక్రా లెట్టివో యే లోహంతో చేసినవో చాలుపడ్డ చోట నేటి గడ్డికాని, చెట్లుకాని మొలవక స్పష్టంగా పెద్ద బండిబాటలవ కన్పిస్తున్నాయి. దుర్మార్గానికి అడ్డు తగిలి దెబ్బతిన్నాడ అన్నట్లు ఈగుట్టకు పెద్దచాలు. ఈ కొండ గుండె వ్రక్కలై పడినట్లు క్రిందిభాగంలో పగిలి పడియున్న పెద్ద గుండ నన్నెప్పుడు కదిలిస్తూండేది. శిల్పశాస్త్ర పరిశోధకు లెవరైనా పట్టించుకొని ఇది యెందుకలా ఉంది అని తెలుసుకుం బాగుండుననిపిస్తుంది. 'ఇది నీ పిచ్చి కాని అసలు రామ యణం నిజంగా జరిగిందా' అని ఒక మిత్రుడంటాడు రామాయణం జరగలేదని మాత్రం ఎలా నిరూపిస్తాం? ఒ వేళ జరిగిందనే అనుకుంటే అప్పుడీ కథ చెప్పకుండాం అప్పుడు పర్ణశాల ఈ ప్రాంతమే అని చెప్పకోవలసివస్తుంది మరొక ప్రాంత మనడానికి వీలుకాదు. వాల్మీకంలో వర్ణించి భౌగోళిక మార్గ ప్రాంతాలు పర్ణశాల ఉనికి ఇచ్చోటనే అ సమర్థిస్తున్నవి. ఇది ముమ్మాటికి సత్యం. అది ఎట్లనగా —

పర్ణశాల కట్టుకొన్నది గోదావరి తీరమే అనుట నిత్య

వాదాంశం. సీతారామ లక్ష్మణులు గోదావరి జలంలో స్నాన మాడుట, పర్ణశాలలో సీత కనపడకపోతే రాముడు లక్ష్మ ణునితో సీత పద్మములు కోసుకొనుటకు గోదావరికి వెళ్ళిం దేమో చూచిరమ్మనుట, తాను వెళ్ళి చూచుట, మరణించిన జటాయువునకు గోదావరి జలంతో తర్పణాలు విడుచుట మొదలగు సంగతులు వాల్మీకి వ్రాస్తాడు. కాని నాసిక్‌లో గూడ గోదావరి ఉందికదా - నాసిక్‌లో పర్ణశాల అను వాద ముంది. అయితే నాసికావాదం వాల్మీకి రామాయణ విరుద్ధం. అది ఖండింపబడినది. పంచవటి నుండి సీతాన్వేషణలో రామ లక్ష్మణులు, మృగములు జటాయువు సూచించిన ప్రకారము దక్షిణ దిశకు వెళ్ళటానికి నైఋతిగా పోయి అచటినుండి తూర్పుగాపోయి కబంధుని జంపి అచటినుండి పడమరగా పోయి పంప (తుంగభద్ర) చేరుకొని దానికి పడమరనున్న శబరి గుహకు పోయి పిమ్మట పంపా సరోవరం తిన్నగా దాటి దాని దక్షిణ తీరాన ఋష్యమూక పర్వతంపై సుగ్రీవాదుల కలుసుకొంటారు. ఇదంతా వాల్మీకి చెప్పిందే. నాసిక్ లోనే పర్ణశాల ఉంటే వాల్మీకి చెప్పిన ఈ మార్గాలను అవలం భించినచో రామలక్ష్మణులు పంపా ఋష్యమూక పర్వతం (కిష్కింద) చేరుకొనలేరు. అది సాధ్యపడదు. అలా వెళ్తే గమ్యం చేరుకోలేరు. ఒకవేళ నాసికావాదు లన్నట్లు వారు ఆగ్నేయ మూలగా పయనించా రనుకొంటే అదీ సాధ్య పడదు. అలా చేస్తే వాళ్లు సముద్రతీరం చేరుతారు కాని

కిష్కింధ చేరలేరు. అదీగాక ఆగ్నేయంగా పయనించినట్లు వాల్మీకి ఎక్కడా వ్రాయలేదు. నాసికా వాదాన్ని ఖండించే మరొక ప్రబలాధారముంది. రావణ వధానంతరం లంకను వదలి రామేశ్వరం నుండి అయోధ్యకు తిరిగి వస్తుండగా మార్గ మధ్యంలో రాముడు సీతకు ఎడమ వైపున కిష్కింధను, కుడి వైపున పంచవటిని చూపిస్తాడు. నాసిక్‌లో పర్ణశాల ఉంటే ఈపై చెప్పిన మార్గం అవలంభించే వాళ్లకు పర్ణశాల ఎడమ వైపుకు, కిష్కింద కుడివైపుకు కాగలదు. ఇది వాల్మీకి రామాయణ విరుద్ధం. ఇదీకాక నాసికా వాదాన్ని కాదనే మరొక ముఖ్యాంశం గమనించ దగినది ఉన్నది. నాసికా వాదం ప్రకారం చిత్రకూటం నుండి దక్షిణంగా పశ్చిమాభిముఖులై నాసిక్ చేరుకుంటే వింధ్య గిరిని నర్మదా తపతులను దాట వలసి వుంటుంది. అట్లా దాటినట్లు వాల్మీకి వ్రాయలేదు. అంత ప్రసిద్ధ పర్వత నదులను వ్రాయక విస్మరిస్తాడా ? కాబట్టి నాసిక్‌లో పర్ణశాల అనే వాదం నిరాధారం, నిర్హేతుకం. ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే పర్ణశాల కట్టుకొన్నది భద్రాచల ప్రాంతంలోగల గోదావరి నదీ తీరంలోననే అని నిరూపించటానికి. ఈ నా పరిశీలనా చర్చకు శ్రీ ఆంధ్ర వాల్మీకి వాసుదాస స్వామి రామాయణం నాకెంతో తోడ్ప డింది. నేను ఈ విషయాన్ని మనసారనమ్మి వ్రాస్తున్నాను. అందుకే—

"సీతా సౌమిత్రులతో
శ్రీరాముడు నడచివచ్చి
ఇచ్చటనే పర్ణశాల
ముచ్చట నిర్మించెననుచు-
త్రేతాయుగ చక్రవర్తి
సీతను పోగొట్టుకొనగ
ఎద ఏర్రై శోకించిన
దిదే ఇదే ప్రాంత మనుచు-"

అని వ్రాయగలిగాను. నేను నమ్మినది వ్రాశాను మరొకరు నమ్మాలని కాదు. ఎవరి నమ్మకాలు వారివి కదా!

ఇదిగాక భద్రాచలం ప్రాంతంలో పర్ణశాల గురించి మరొక ముఖ్య విషయం మనవిచేస్తాను. పర్ణశాల భద్రాచల ప్రాంతమే అన్నప్పుడు అది గోదావరికి ఏ ఒడ్డున? కుడి ఒడ్డుననా? ఎడమ ఒడ్డుననా?

భద్రాచలానికి 36 కి.మీ. దూరంలో పర్ణశాల అను ఒక చిన్న గ్రామముంది. అది గోదావరికి ఎడమ ఒడ్డు తూర్పుతీరం. అక్కడ శోకరాముని గుడి వుంది. సీతారామ లక్ష్మణులు ఇచ్చటనే పర్ణశాల కట్టుకొని ఉన్నట్లు కొన్ని ముచ్చటైన సంగతులు చెప్పుకొంటారు. కాని పర్ణశాల కట్టు కొన్నది ఈ ఒడ్డుకాదు. నదికి కుడి ఒడ్డున అని నమ్మదగిన రుజువున్నది. ఇక్కడ గోదావరి ఉత్తరం నుండి దక్షిణంగా

36 కి. మీ. భద్రాచలం ఉష్ణకుండాల వరకు ప్రవహిస్తూ, అక్కడి నుండి తూర్పుగా సాగిపోయింది. ఇప్పుడున్న పర్ణశాల నిజమైనదైతే రావణుడు సీత నెత్తుకొని పోతూ గోదావరి దాటవలసి ఉంటుంది. కాని గోదావరి దాటినట్లు వాల్మీకి వ్రాయడు. కనుక పర్ణశాల ఇచ్చటి గోదావరికి కుడి ఒడ్డున అనగా పశ్చిమాన 'రథపు గుట్ట' దగ్గర ఉన్నదనుటే సహజ సిద్ధం. ఇప్పుడున్న పర్ణశాల కెదురుగా ఆవల గట్టున అనగా పశ్చిమ తీరాన నదికి కుడి ఒడ్డున 'రథపు గుట్ట' కొట్ట వచ్చినట్లు దర్శనమిస్తుంది. దానికి సమీపంలోననే పర్ణశాల ఉండెననుటకు చాల కారణాలున్నవి.

రామ లక్ష్మణులు లేని అదను చూచుకొని కాని రావణుడు పర్ణశాల సమీపించలేదు. ఈవలి ఒడ్డున నుండి ఆవలి ఒడ్డున కల పర్ణశాలలో ఇది గమనించుట కష్టము గనుక రథపు గుట్టపై తేరునాపి గుట్టపైనుండి పొంచి దాని క్రింద సమీపంలో నున్న పర్ణశాలను రామ లక్ష్మణులు లేని అదను చూచుకొని సమీపించి సీతనెత్తుకొని వెంటనే దగ్గరనున్న విమానంపై నెక్కించుకొని పారిపోయాడు. రామాయణంలో సీతను దొంగలించినపుడు తేరు సిద్ధంగా ఉండెనని తటాలున సీతను ఎక్కించుకొని ఆకాశాని కెగసి పోయెనని ఉంది. కాని రథపు గుట్టలో రథమాపి ఏరుదాటి ఏటి కావలి ఒడ్డున గల పర్ణశాల నుండి సీత నెత్తుకొని ఈ వలిగట్టునకు వచ్చి

రథముపై నెక్కించుకొని పోయెననుట సాగనిపని. ఒకవేళ అలాచేసినా ఏరు దాటినట్లు వాల్మీకి వ్రాసి ఉండేవాడుకదా. తేరులో దాటినా వ్రాసేవాడు.

ఇదిగాక ఈ రథపు గుట్ట సమీపంలో సీత గుట్ట అను పర్వతముంది. దీని క్రింద పడమటిపైపు పెద్ద బయలుంది. అందు ఖరునితో వాని పదునాలుగు వేల రాక్షసులతో రాము డొక్కడు దొమ్మిపోరు చేస్తుండగా సీతాలక్ష్మణులు సీతగుట్ట అను ఈ పర్వతంపై నుండి చూస్తారు. అలా చూస్తే బాగా కనిపిస్తుంది కూడా.

ఈ పర్ణశాలకు దక్షిణ దిశకు సుమారు 10 కి. మీ. దూరాన 'దుమ్ముగూడెం' (ధూమగూడెం) అను ఊరుంది. (ధూమము = పొగ. ధూమజము=మబ్బు. ధూమ్యాటము= పక్షి విశేషము) రావణుడు పెనుగాలి సృష్టించి వాని చాటున ఎవరికీ కానరాకుండ సీత నెత్తుకొని ఆకాశ మార్గాన పోయె నని రామాయణంలో రామునితో జటాయువంటాడు. అందుకే ధూమ ధూమజములు కల్పించిన ఈ చోటునకు ధూమ గూడెం లేక దుమ్మగూడెము అను పేరు వచ్చి యుండ వచ్చును. దుమ్మగూడాని కెదురుగా పశ్చిమ తీరాన ఒక చిన్న గుట్టవుంది. దానిని జటాయుగుట్ట అని పిలుస్తారు. దీనికి సమీపంలోనే జటాయు రావణుల యుద్ధం జరిగి యుండాలి.

మరొక విషయం రామాయణాన్ని బట్టి పర్ణశా॥ సమీపంలో పద్మసరోవరం ఉండాలి. ఇక్కడ (రథపు గుట్ట వైపు) పెద్ద చెరువుండినట్లు చెప్తారు.

సీతాన్వేషణలో మృగములు దక్షిణ మార్గాన్ని చూపు తాయి. ఇక్కడి గోదావరి నేరుగా దక్షిణంగా ప్రవహించడం వల్ల ఏరడ్డమయి కొంత నైఋతిదిశగా వెళ్తారు. జటాయువు కూడ దక్షిణ మార్గం చెపుతాడు. అప్పుడుకూడ నైరుతి మూలగా పోయి మూడు కోసులు తూర్పుగా వెళ్లిరని రామాయణం చెపుతుంది. అలా రావటం వల్లనే భద్రాచలం వద్ద గోదావరికి దక్షిణ దిశకు చేరుకొని ఏరు దాటకుండానే పంప (కిష్కింధ) పోవు మార్గం పట్టారు. ఏరు దాటినట్లు వాల్మీకి వ్రాయలేదు.

పర్ణశాల గోదావరికి తూర్పుతీరాన ఉండినట్లయితే నైఋతి వెళ్ళడానికి ఏరడ్డమయి వీలుపడదు. ఎందుకంటే ఇక్కడ గోదావరి ఉత్తరం నుండి దక్షిణంగా ప్రవహిస్తుంది కదా! కనుక ఇప్పుడున్న పర్ణశాలకాదు కాని దానికెదురుగా గోదావరికి పశ్చిమ తీరాన 'రథపు గుట్ట' కు ఉత్తరాన పర్ణశాల ఉండెనని చెప్పవలసి ఉంటుంది. అయితే ఇప్పు డున్న పర్ణశాల, దుమ్ముగూడెం ఎటపాక గోదావరికి ఎడమ ఒడ్డుకు అనగా తూర్పు తీరాన ఉన్నవి. రామాయణం జరిగింది యుగాలనాడు కదా. ఇంత కాలానికి నది తన

గమనవేగంలో కొంత పడమటికి కుడి ఒడ్డును ఒరసి జరిగి యుండవచ్చు. లేక ఆయా సంఘటనలు తమ సమీపంలో జరిగిన వగుటచే ఈవలి ఒడ్డున ఏర్పడిన గ్రామాలు తమ వద్దనే జరిగినట్లుగా ఆయా పేర్లతో వ్యవహరింపబడుట జరిగి యుండును.

ఏదెట్లున్నా వాల్మీకంలో చెప్పబడ్డ కొన్ని సంగతులు- సీత పర్ణశాలలో కనుపించకపోతే పద్మాలు కోసుకొని రావడానికి గోదావరికి వెళ్లిందేమో అని రాముడనటం, జటాయువుకు గోదావరి జలంతో నివాపములు విడువటం, రామలక్ష్మణులు పట్టిన మార్గాలు మున్నగునవి పర్ణశాల గోదావరి తీరాననే అని తెట పరుస్తున్నవి. నాసికలో పర్ణశాల ఉండటానికి పైన చెప్పిన కారణాలవల్ల వీలుకాదు. ఒకవేళ రామాయణం జరిగివుంటే భద్రాచల పర్ణశాలయే నమ్మదగినది.

రామాయణం ఎక్కడ జరిగిందనే దానికన్నా అది జరిగిందని చెప్పటంలో సత్యముంది. ఎందుకంటే అదొక సహజమైన కథ. అందులో లోక విరుద్ధమైందేదీ లేదు. అందులో ఉన్నవి మంచీ చెడూ రెండూనూ. ఆ మంచి చెడులు అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ ఉంటూనే వున్నవి మంచిని పెంచటం చెడును త్రుంచటం మానవ ధర్మం. ఈ మానవ ధర్మాన్ని ప్రభోదిస్తూంది రామాయణం.

భద్రాచల సమితిలో ఇప్పుడున్న పర్ణశాల ఒక ప్రాం
కెమ్యా సర్కిల్ హెడ్ క్వాటర్సు. కనుక నేనప్పుడప్పుడపిస్త
ఉద్యోగరీత్యా ఇక్కడికి రావడం జరుగుతూ ఉండేది. రథ
భద్రాచలం దర్శించవచ్చిన వారందరూ తరుచు ఈ పర్ణశాలకో
కూడ దర్శిస్తారు. ఇక్కడ శోకరాముని గుడి వుంది. ఇక్కడ రెండ
... 'రథపు గుట్ట' కొట్ట వచ్చినట్లు ఆవలి గట్టున కనిపిస్తుంది.

... నా మట్టుకు నేను ఇక్కడికి వచ్చినప్పుడు శోకరాముని
గుడిని దర్శించుటకు ముందు ఈ గుట్టను చూస్తూ కొన్ని నా
నిముషాలు ప్రతిమలా నిలచి పోయేవాడిని. 'సార్ ! గుడికి నా
వెళ్దామా !' అని నా సహాయ గణాంక మిత్రుడనటం జరిగేది. కాని
గుడి ఆవలి గట్టున ఉండాలి కదా అని అనుకునే వాణ్ని. లోకై
కాని ఆవలి గట్టు నిర్జన ప్రాంతం. ఎక్కడ జనమో అక్కడ గేయ
ఊరు గుడి ఉంటాయి కదా ! అదిప్పుడు మణుగూర్ కవన
తాలూకా ప్రాంతం. ఆ ప్రాంతంలోనే బొగ్గు గనులు. — ఎని
"...ట లంకేశుడు సీత నెత్తుకొని పోయెన్ గర్భశోకాగ్ని భ్రమిం పై
గుట భూదేవికి గుండియల్ కమిలి బొగ్గుందేర కోల్ మైనులి నాకే
వ్వుటవర్ధిల్లె" అని ఈ ప్రాంతం దర్శించకముందు ఎల్లందు బయ
కొత్తగూడెం బొగ్గుగనులు దృష్టిలో పెట్టుకొని వ్రాశాను. కట్టిన
కాని దూరాన్వయమైంది కదా అని కొంత కొదువగా అని
...ంచేది. తరువాత ఈ రథపుగుట్టకు సమీపంలోనే పర్ణశాల
అని ఇక్కడే మణుగూరు బొగ్గు గనులని తెలుసుకొని నా
పద్యానికి నేను తృప్తి పడ్డాను. ఈ రథపుగుట్ట సమీప

ప్రాంతమంతా తనివితీరా తిరిగి చూడాలని నాకిప్పటికీ అని పిస్తూనే ఉంది. ఈ ప్రాంతపు కోయలతో పర్ణశాల గురించి రథపుగుట్ట గురించి ముచ్చటిస్తూనే వుంటాను. నాతో ఒక కోయ అన్నాడు కదా "ఆ గుట్ట కింద ఒక పెద్ద గుండు రెండుగా పగిలి పడ్డది. అది రావణాసురుని విమానం దెబ్బకు పగిలింది" అని. నిజమే అనిపించింది నాకు.

ఈ రథపుగుట్ట చూచినప్పుడే కాక అప్పుడప్పుడు అది నా యెదలో మెదలుతూ నన్ను కదిలిస్తూండేది. గణితము నా వృత్తి. కవిత్వము నా ప్రవృత్తి. (గణాంకము నా వృత్తి కాని గణబద్ధమైన కవిత నా ప్రవృత్తి). నేను నా ప్రవృత్తికి లోనైన వాడను. రథపుగుట్ట ప్రేరణ కారణంగా పర్ణశాల గేయ కావ్యం నా కలంనుండి ప్రభవించింది. విరామ వేళల్లో కవన రచన చేసుకోవడం నా కలవాటు. అది నా అభిరుచి. ఎన్నిసార్లో నన్ను రథపుగుట్ట కదిలిస్తూ కవితా రచనకు పురికొల్పిస్తుండేది. కాని తీరికగా కూర్చుని వ్రాసే అవకాశం నాకేది? కాని ఒకనాటి ప్రాతఃకాల సమయంలో వాహ్యాళికై బయటికి వెళ్ళి పచారు చేస్తుండగా ఈ రథపుగుట్ట నా కళ్ళకు కట్టినట్లు కనిపిస్తూ ఏదో చెప్తున్నట్లు నా కనిపించింది.

సీతా సౌమిత్రులతో శ్రీరాముడు నడచి వచ్చి
ఇచ్చటనే పర్ణశాల ముచ్చట నిర్మించె ననుచు—
గోదావరి కుడి ఒడ్డున గుట్ట ఒకటి చెపుతున్నది
భద్రాచల సీమలోన పర్ణశాల ఒకటున్నది!

అను గేయ పంక్తులు అప్రయత్నంగా రావటం అప్పు
మరొక మనోహర దృశ్యం నా లోగన్నుల కగుపడట
జరిగింది. అది పర్ణశాల ప్రాంగణం. రాముడు అంగణం
ఆలోచనా నిమగ్నుడై పచారు చేస్తున్నాడు. లక్ష్మణుడ
అల్లంత దూరంలో ఏదో పనిలో నిమగ్నుడై వున్నాడ
సీత పర్ణశాలలోపల ఉంది. ఆ తరుణంలో శూర్పణఖ పొద
చాటునుండి పొంచి చూస్తూ రామ లక్ష్మణుల అపూర్వ
సౌందర్య తారుణ్యాలకు ముగ్ధురాలై వారిని మోహిం
తన్మయత్వంలో ఇలా అనుకొంటున్నట్లు నాకు తోచి–

నీలంపు మేఘమే
నేలదిగి వచ్చెనా !
బంగారు కొండయే
ముంగిటను నిల్చెనా !

నలువ తమ్ములు వీరు
నాకు తగు బందుగులు
వీనినే చేపట్టనా ! లేకున్న
వానినే వరియింపనా !

అను గేయి పంక్తులు అలవోకగా నాలోనేను ఆలాపించాను
కవితావేశపూరితుడనై త్వరత్వరగా నడుస్తూ ఇల్లు చేరుకొని
కలం కాయితం తీసికొని వ్రాయ నారంభించాను. అద్ది

ఉషఃసమయం. ఎట్టి శుభ ముహూర్తమో కాని 'కృత్వాద్వ్యవస్థ' అను సూక్తికి విరుద్ధంగా నిరాటంకంగా నా గేయ రచన సాగింది. 2 గంటలు వ్రాస్తూనే ఉన్నాను. అప్పుడు 8 అయింది. 'స్నానానికి లేవండి' అన్న శ్రీమతి కంఠం వినవచ్చింది. మరికొంతసేపు అలానే వ్రాస్తుండి పోయాను. "స్నానం, భోజనం, ఆఫీసు అన్నీ మరచారా కవిత్వంలో పడి' అన్న మందలింపు. అప్పుడు కాని ఎలాగో కలమాపిన వాడనుకాను. నాటి నుండి ప్రతి దినం ఉదయం వర్ణశాల రచన సాగిస్తూ శూర్పణఖ ఘట్టం, సీతాపహరణం, జటాయువు పోరు, ఆ మహనీయుడు కూలిపోవటం వరకు కొద్ది రోజుల లోనే ముగించాను. కాని ఆ పక్షీంద్రుని మానవతా తత్త్వం నన్నెంతో కదిలించింది. "ధర్మో రక్షతి రక్షితః" అన్న సూక్తికి విరుద్ధంగా అధర్మానికడ్డుతగిలి పోరాడుతూ జటాయువు అలా హతుడై పోవటం నన్నెంతో బాధించి నాలో ఘర్షణ చెలరేపింది. అందుకే జటాయువు పడిపోగానే గేయ పంక్తులు ఏదో పరిష్కారాన్ని వెదకుతూ ధర్మ సిద్ధాంతాన్ని బలపరుస్తూ అవసరాని కెక్కువగా సాగిపోయినవి. అధిక ప్రసంగానికి క్షంతవ్యుడను. జటాయువు వీరత్వాన్ని, మానవత్వాన్ని వెల్లడించే ప్రయత్నంచేశాను. అంతవరకే నా రచనకు పూరింపుచేసి తృప్తిపడ్డాను. కాని–

నేనొక రోజు హైదరాబాదుకు వెళ్ళినప్పుడు గురువర్యులు పూజ్యశ్రీ డా॥ దివాకర్ల వేంకటావధానుల వారిని

దర్శించుకొని నా యీ చిరుహొత్తాన్ని చూపించితిని. వారి నన్నెంతో ప్రోత్సహించి నాపై వాత్సల్యం కురిపించి "బాగుంది మీరు జటాయువు దహన సంస్కారాలు చేయిం చండి. రాముని కృతజ్ఞత చాల గొప్పది. రాము డంటాడ సీత పోయినందుకు నాకు బాధగావుంది కాని అంతకన్నా జటాయువు నాకై మరణించినందుకు ఎక్కువ బాధగావుంది అని తిన్నగా "రాముని కృతజ్ఞత వరకు వ్రాయండి" అని సలహా ఇచ్చారు. శ్రీవారి సలహాను పాటించి వ్రాయ నారం భింతును కదా! గ్రంథ మంత కంతకు పెరుగుతూ ఎంతకు ముగింపు పడకుండా సాగిపోయింది. కొద్దిలో ముగుస్తుంది కదా అనుకున్నాను. రాముని శోకం, సీతాన్వేషణ, జటా యువు దహనక్రియలు మున్నగు అంశాలు వర్ణించడం వ గ్రంథం మూడంతలు పెరిగింది. శ్రీవారి సలహా సంప నా ఈ కావ్యానికి కరుణ రసంతో నింపి పరిపూర్ణత నిచ్చింది కాకపోతే ఈ నిండు దనం రాకపోయేది.

ఒకసారి ఆస్థాన కవులు డా॥ దాశరథిగారు తమ సోదరులు శ్రీరంగాచార్యుల వారితో ఖమ్మం వచ్చినప్పుడు వారిద్దరూ నా ఈ గేయ కావ్యాన్ని తమకు వీలున్నంతలో నేను వినిపించగా విని ఆనందించి నన్నెంతో ప్రోత్సహించారు.

పెద్దల అభినంద నాశీర్వాదములకు నేనెప్పుడూ వినమ్రతాంజలి ఘటిస్తాను.

నన్ను కావ్య రచనకు ప్రేరణ గావించిన రథపుగుట్టకు నేను మిక్కిలి ఋణపడి యున్న విషయం సరేసరి. నన్ను రచనా వ్యాసంగంలో వెన్ను తట్టి ప్రోత్సహించిన పూజ్యశ్రీ దివాకర్ల వేంకటావధానుల వారికి శ్రీమాన్ దాశరథి గారికి నేనెంతయు కృతజ్ఞుడను.

శుద్ధప్రతులు సిద్ధంచేసిన మా ప్రియతమ చిరంజీవులు సౌభాగ్యవతులు విజయశ్రీ, జయశ్రీ, రామశ్రీ మరియు చి॥ శుభశ్రీ లకూ ఇందు చిత్రములు వేసిన మా రెండవ చిరంజీవి రాజశేఖరాచారికి ఆశీస్సులు.

నాకు చిక్కిన కొద్దిపాటి విరామ సమయాన్ని ఇంటి పనులు చూచుకొనుటకు బదులు కవితా వ్యాసంగంలో పడి పోతున్నందుకు నాతో పోరు పెట్టుకోక పోవుటేకాక నా కవితలకు ప్రథమ శ్రోతయై నన్నెంతో ప్రోత్సహిస్తున్న నా అర్ధాంగికి నా శుభాభినందనలు.

—'రసప్రియ' కేశవాచార్య

డా॥ దివాకర్ల వేంకటావధాని. ఎం.ఏ.(ఆనర్స్)పి. హెచ్.డి.
డిప్యూటీ ఆంధ్ర శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వ విద్యాలయం. (ఆం. ప్ర.)

# ప్ర శం స

శ్రీ కేశవాచార్యులుగారిని చాల సంవత్సరాల నుండి నేనెరుగుదును. వారు రసజ్ఞులు; కవితా ప్రియులు; పరమ భక్తులు. వారిదివరకు రచించిన శతకమును చదివి నేనెంతో ఆనందించితిని. వారి వృత్తి గణాంకమునకు సంబంధించినది. అయినను అదృష్టము వలన వారికి కవితానురక్తియు దానితోపాటు కవితా నిర్మాణ శక్తియు నలవడినవి.

రామాయణ కథచే నాకర్షింప బడనివారు లోకమునందుండరు. ఇంక భారతీయుల విషయము వేరుగా చెప్పనక్కరలేదు. శ్రీ కేశవాచార్యులుగారుద్యోగ ధర్మముచే భద్రాచల ప్రాంతమున కరిగి నప్పుడు గోదావరీ తీరమున ...ందలి పర్ణశాల సమీపమున గల రథపుగుట్ట దర్శించిరట. ...ాని మీద రావణుని రథ చక్రముల జాడలున్నవట. పంచ...టీ స్థల నిర్ణయమును గూర్చి వాదోపవాదము లున్నవి. శ్రీ కేశవాచార్యులుగారు బలవత్తరములైన ఆధారముల చూపి అది భద్రాచల ప్రాంతముననే అని నిర్ణయించినారు. ఆ పవిత్ర భావము వారి హృదయమును నంటి గాఢముగా

కొత్తుకొనుటయే యీ కావ్యము యొక్క అవతరణమునకు కారణమైనది.

పర్ణశాలలో రామాదులు నివసించు చున్నప్పుడు శూర్పణఖ వచ్చి రాముని మోహించుటయు, తుదకు పరాభవింప బడి రావణునికి సీత సౌందర్యమును తెల్పుటయు, రావణుడు మారీచుని సాహాయ్యమున రాముని వంచించి సీత నపహరించుకొని పోవుటయు, రాముడు పర్ణశాలకు తిరిగి వచ్చి సీతను కానక దుఃఖించుటయు, రావణుడు జటాయువుతో పోరి తత్పక్షములు ఖండించుటయు, రాముడు సీత నన్వేషించుచు పోయి జటాయువును గాంచుటయు, అతనివలన వృత్తాంతము నెఱింగి అతనికి కృతజ్ఞతా పూర్వముగా దహన సంస్కార మొనరించుటయు నిందలి ముఖ్య విషయములు.

నారదుని వాల్మీకి పదునాఱు గుణములు కల నాయకుని తనకు తెల్పుమని వేడుకొనెను. ఆ పదునాఱు గుణములలో కృతజ్ఞత యొకటి. రాముని యందలి కృతజ్ఞతా గుణము నాన్యతో దర్శనీయము. జటాయువును దర్శించి అతనికి దహన సంస్కారము నొనరించుట యందది గోచరించును. దానితోనే యీ గేయకావ్యము ముగియుచున్నది. తాపియోగము కంటెను తనభార్య నిమిత్తమై జటాయువు

ప్రాణములు కోల్పోవుట రాముని కెక్కువ విషాదవ
కలిగించెను. అతని కృతజ్ఞతావిశేష మట్టిది.

కవిత్వము ప్రయత్నముచే నబ్బునదికాదు. అ
ప్రతిభాజన్యము. ప్రతిభ దైవప్రసాద లభ్యము. దైవా
గ్రహమున్న వారికే కవిత అప్రయత్నముగా నలవడున
శ్రీకేశవాచార్యులవారు దైవానుగ్రహముచే స్వచ్ఛందము
కవిత్వము రచించినవారు. ఈ గేయకావ్యము కూడ న
అప్రయత్నముగా వారికలమునుండి వెలువడినది.
విషయము వారి పీఠిక వలన స్పష్టముగా తెలియవచ్చును

ఇందలి గేయములు సెలయేటి వలె నప్రతిహతగ
కములై సహజ మనోహరముగా జాలువాఱుచున్నవి. అచ
టచ్చట గతిభేదము కూడ గోచరించుచున్నది. రాముని ఏ
పత్ని వ్రతత్వమును, పరాక్రమ సంపదను, లక్ష్మణు
భ్రాతృభక్తిని, శూర్పణఖ యింద్రియ లోలత్వమును, రా
ని కామాంధత్వమును వారు సుస్పష్టముగా చిత్రిం
యుండిరి. రాముడు జటాయువును దర్శించిన ఘట్టమును
తకై విలపించిన ఘట్టమును కరుణ రస నిర్భరములై
యున్నవి. గేయము లందలి పదముల కూర్పు హృద్యముగా
నున్నది. భావములు సహృదయ హృదయానంద సంధాయ
కములుగా నున్నవి. శ్రీ కేశవాచార్యులుగారు గేయము
నవలంభించినను యతి ప్రాసలను విడువలేదు. మాత్ర

గణములను పాటించిరి. వ్యర్థపదము లెచ్చటను లేవు. ఈ విధముగా రామాయణము నంతను వారు వ్రాసిన యెడల పండిత పామరుల కెంతో ఆహ్లాదకరముగా నుండును. ఇందు సందర్భాను గుణముగా జేర్పబడిన చిత్రములు సన్నివేశమున కనుగుణములై మనోహరముగా నున్నవి. వారింకను ఇట్టి రస వన్మనోహరములైన రచనలు కావించి ఆంధ్ర సరస్వతి కభినవాలంకృతు లలవరింతురుగాక యని కోరుచున్నాను.

భాగ్యనగరము
తేది: 31-8-1982

—దివాకర్ల వేంకటావధాని

"కళాప్రపూర్ణ"
డా॥ దాశరథి, డి. లిట్.
ఆస్థాన కవి (ఆం. ప్ర.)

# కవితా సౌవర్ణశాల "పర్ణశాల"

'రసప్రియ' శ్రీ కేశవాచార్యుల వారు రామ భక్తులు. వారు రచించిన శతకాలు చదివాను. భక్తి పారవశ్యం ప్రతి పద్యంలో నాకు కనిపించింది.

ఈ "పర్ణశాల" చక్కని గేయ కావ్యము. పీఠికలో కవి గారు పర్ణశాలను గురించి వివరంగా చర్చించారు. భద్రాచల ప్రాంతంలోనిదే నిజమైన పర్ణశాల అని వారు నిరూపించారు.

సీతా రామ లక్ష్మణులు తమ ఊరు మీదుగానే ప్రయాణం చేశారనీ, సీతమ్మ చీర ఆరవేసుకున్నది ఈ రాతి మీదనే అనీ వారు స్నానం చేసింది ఈ చెరువులోనే అని చాలా మంది చెబుతుంటారు. అది వారి రామ భక్తికి నిదర్శనం.

కాళిదాసు మేఘ సందేశం లోని మొదటి శ్లోకంలో ప్రస్తావించిన రామగిరి చిత్రకూటమే. చిత్రకూటం దక్షిణం లోనే ఉంది. అరణ్యవాసం చేస్తున్నప్పుడు సీతా రామ లక్ష్మణులు నిర్మించుకున్న పర్ణశాల కవిగారిని ఈకావ్యం

వ్రాయించింది.

రసప్రియ గారిది రసదృష్టి. రసావేశం వారిలో ఊరకలు
కొస్తూ ఉంటుంది.

ఇది ఆరు ఆశ్వాసాల గేయకావ్యం. జటాయువు చేసిన
ధర్మయుద్ధంగురించికవిగారు అద్భుతంగా వ్రాశారు. జటా
యువు ఓడిపోయాడు. రావణుడే గెలిచాడు. ఇది తాత్కా
లికం. ధర్మం కొన్ని సందర్భాల్లో ఓడిపోతుంది. కాని
అంతిమ విజయం ధర్మానిదే. రావణుడు రాముని చేతిలో
చావాలి. జటాయువు చేతిలో చావకూడదు.

"ఇలయందు, సూర్యచం
ద్రులయందు, మెరయు చు
క్కలయందు, కురియు మే
ఘములందు................"

అన్న గేయంలో —

"దౌర్జన్య మెదిరించరా !
మానవుడ !
ధర్మమ్ము రక్షించరా!"

అని ఉద్బోధించారు కవిగారు. ఈ ఉద్బోధ ఈ
నాటికీ అవసరం.

ఈ నాడూ రావణులున్నారు. సీతాపహరణం జ
తున్నది. ప్రతి ధర్మ పురుషుడూ రాముడై అధర్మ రావణు
ఎదిరించి, హతం చేయాలి.

'రసప్రియ' గారి పర్ణశాల రసిక జన రంజక
సహృదయ ఆదరాభిమానములను చూరగొనగలదని
సిస్తున్నాను.

ఈ పర్ణశాల కవితా సౌవర్ణశాల.

భాగ్యనగరం
1-9-1982

— దాశ

పద్మశ్రీ, కళాప్రపూర్ణ
డా॥ సి. నారాయణరెడ్డి, ఎం.ఏ., పి. హెచ్.డి., డి.లిట్
అధ్యక్షులు
అధికార భాషా సంఘం, ఆంధ్రప్రదేశ్,
సచివాలయం, హైదరాబాదు.

# అభిప్రాయం

కథ పురాతనం
కథనం నవీనం.

వాల్మీకీయంతోపాటు స్వకీయంకూడా ఉండడంవల్ల ఈ అనుస్సృజనానికి అభినవత ఏర్పడింది.

సరళంగా గతివైవిధ్య తరళంగా రచించిన 'పర్ణశాల' రసహృదయులకు ఆనందహేల. ఇందుకు కేశవాచార్య అభినంద్యులు.

హైదరాబాదు
తేది 26-4-1985

—సి. నారాయణరెడ్డి

# కృతజ్ఞత

నాకీ సందర్భంలో మరపురాని విషయం శ్రీ టి.టి. వారి ఆర్థిక సహాయం. ఇది లేకున్నచో నేనీ గ్రంథ ముద్రించ గలిగే వాణ్ణికాదు. కనుక గ్రంథముద్రణకు త ఆర్థిక సహాయం చేసి నన్ను ప్రోత్సహించిన శ్రీ తిరుమ తిరుపతి దేవస్థానం పాలకవర్గం వారికి నేనెంతయు కృత డను. తద్విధంగానే ఆర్థిక సహాయం చేయుటకు అంగీ రించిన శ్రీ భద్రాచల సీతారామ చంద్రస్వామి దేవస్థాన పాలకవర్గం వారికిని నాహృదయ పూర్వక కృతజ్ఞత తెలుపుకొంటున్నాను.

నా కావ్యానికి దయతో తమ అమూల్యాభిప్రాయ లొసగి అభినందనాశీర్వాదములతో నన్నెంతో ప్రోత్స హించిన విశ్వవిఖ్యాత విద్వత్కవి వర్యులు పూజ్యులు డా॥ దివాకర్ల వెంకటావధానిగారికిని, ఆస్థాన కవివర్యులు డా॥ దాశరథిగారికిని, అధికార భాషా సంఘం అధ్యక్షులు డా॥ సి. నారాయణరెడ్డిగారికిని కృతజ్ఞతతో ప్రణమిల్లు చున్నాను.

నేనీ కావ్యం ఖమ్మంలో ఉండబట్టి వ్రాయగలిగాను. తన అపార నైసర్గిక ప్రాచీన పవిత్ర చారిత్రక సంపదతో ప్రేరేపించి నాచే 'భద్రగిరి శతకం' 'పర్ణశాల' వ్రాయించిన ఖమ్మమునకు ఋణపడిపోయాను.

ఈ పుస్తకాన్ని చక్కగా ముద్రించి యిచ్చిన వియన్. ఆర్ట్ ప్రింటర్సు ప్రొప్రైటరు నాగభూషణంగారికి అభినందనలు.

రచయిత

# పితృ స్మృతి

ఇది భద్రాచల రాముని
పద సన్నిధి కిడిన కావ్య పద్మము పుణ్య
ప్రద మిందు నిన్ను దలచెద
సదమల చిత్తంబుతోడ సతతము తండ్రీ!

కార్తీక శుద్ధ ఏకాదశి మధ్యరాత్రి
కన్నుమూసిన కన్నతండ్రీ!
సహస్రపమాస జీవన స్రవంతిలో
సౌజన్యంలా కరిగిపారిన పుణ్యమూర్తీ!
నీ కిదే స్మృత్యంజలి!
నీ కిదే కవితాంజలి!

నాగతల్పంనుండి నారాయణుడు మేల్కొన్న పుణ్యదినం అది
నారాయణదర్శనార్థం నారదాదులు వేచియున్న పర్వదినంఅది
అందుకే నీ వా నాడు అత్యంత ఆతురత పడ్డావు.
కృష్ణారామా! అంటూ విష్ణుసాయుజ్యం చేరుకున్నావు.

అది శరచ్చంద్రికా విలాసం! విధివిలయ వికటాట్టహాసం!
అదే రుధిరోద్గారి వర్షం! రుధిరేక్షణ దుర్విధి హర్షం!

కాయం నిలువకని కావ్యం నిలుస్తుందని
నా యీ పర్ణశాలలో నానాటికీ నీ స్మృతి నిలవాలని
డెందంలోనే కాక ఇందులోనూ నిన్ను స్మరిస్తాను.
మందిరంలోనే కాక మనసులోనూ నిన్ను పూజిస్తాను.

గోవులన్నా బ్రాహ్మణులన్నా కొండంత భక్తి నీకు
హాలికులన్నా అభాగ్యులన్నా అత్యంత ప్రేమాసక్తి నీకు.

బలాలులేని పొలాలు హలాన దున్నీ దున్నీ
ఫలితం దక్కనప్పుడల్లా ప్రాప్తంలేదని
నిరాశానిస్పృహలకులోనుకాని నిష్కామయోగివి
నీవు నిక్కమైన కర్షకుడివి.

నిరంతర శ్రామికోద్యమం నీది
నీ అడుగుజాడలలో నడువగల శక్తి మాకేది ?
ముదిమిపైబడినా పదునుగల మగటిమి నీది
మొక్కవోని పౌరుషంతో నీ వొకరికి చెయిసాచిన రోజేది ?

నీవు నిరుపేదల బంధువని నీ అంతిమయాత్రనాడే తెలిసింది
నిరుపేద కంఠమొకటి నాడు నీకై కన్నీటిపాట పాడింది.

ఉపకారం చేయడమేకాని పొందే స్వభావం కాదు నీది.
ఒకవేళ ఎవరైన చిరుసాయంచేస్తే దాన్ని కొండంతగా
భావించే గుణం నీది.

పక్షవాతంతోవడ్డ నీ తండ్రికి పవలనక రేయనక
భక్తితో సేవచేశావు ఏడేండ్లు ఏమాత్రం విసుగుకొనక.

ఓ సౌజన్య సౌభ్రాతృమూర్తీ !
నీ సౌదర్యౌదార్యాలకు మేరేది ?
కలహించిన సోదరులకై కన్నీళ్ళునించుకునే వాడవు.
కపటంలేని నిష్కల్మషపీయూష హృదయంనీది.

చిత్రం లేదని నీ గుణాలు చిత్రించ యత్నించాను.
గుణాలన్నీ చిత్రించలేక నిన్ను నా చిత్తంలోనే చిత్రించు
కున్నాను.

తండ్రీ ! నీ ఋణం తీర్చరానిది. అది మేరువంత పెద్దది.
దానిభారంతో తలలువాల్చి నీకు భక్త్యంజలి ఘటించాము.

# పర్ణశాల

భద్రాచల సీమలోన
పర్ణశాల ఒకటున్నది
గోదావరి కుడిఒడ్డున
గుట్ట ఒకటి చెపుతున్నది.

పర్ణశాల తనకు సమీ
పాన వెలసి యుండినదని
రథపుగుట్ట "వినుడీః" యని
వ్యధతో కథ చెపుతున్నది.

సీతా సౌమిత్రులతో
శ్రీరాముడు నడచివచ్చి
ఇచ్చటనే పర్ణశాల
ముచ్చట నిర్మించెననుచు,

త్రేతాయుగ చక్రవర్తి
సీతను పోగొట్టుకొనగ
ఎద యేరై శోకించిన
దిదే ఇదే ప్రాంత మనుచు,

రావణ రథ చక్రమ్ముల
రాపిడి వడి చాలుపడ
'రథపుగుట్ట' పేరు తనకు
ప్రథితమ్మై పోయినదని.

సీత నపహరించవచ్చు
చెనటి రథమ్మును డీకొని
గాయపడ్డ 'రథపుగుట్ట'
గేయ మొకటి చెపుచున్నది.

చిలుకా గోర్వంకలవలె
సీతా రాముల జంటను
తిలకించిన పుణ్య ఫలము
పలికించగ పలికితినని_

రామాయణ ప్రతి ఘట్టము
రసభరితము కాదా! శ్రీ
రామ కథా సుధారసము
రాతి నిగుర జేయుకదా!

ఒకనాడు శూర్పణఖ
ఒయ్యారమొలుకంగ
ఇటవచ్చి మోహించె
ఇన వంశ సోదరుల

పొదల చాటున దాగి
పొంచి చూచి వరించె
నవ యౌవనోజ్జ్వలుల
నవమోహ నాకృతుల

ప్రాంగణము లోనుండు
రఘు వీర సోదరుల
తిలకించి పులకించి
తలపోసె తానిట్లు—

"నలువ తమ్ములు వీరు
నాకు తగు బందుగులు
వీనినే చేపట్టనా ? లేకున్న
వానినే వరియింపనా ?

నీలంపు మేఘమే
నేలదిగి వచ్చెనా!
బంగారు కొండయే
ముంగిటను నిలిచెనా!

మబ్బు వన్నెకాడు వీడు
మత్తు మందు చల్లినాడు
పసిడి వన్నెకాడు వాడు
కసిగా ఉసికొల్పినాడు

వీనిపొకు చేకొందున?
వాని చేసి కోమందున!
వీని పొందులో నుందున?
వాని దాననై యుందున!"

ఈ గట్టున పచ్చిక గని
ఆ గట్టున పచ్చిక గని
ఈ గట్టున మేయుదునా!
ఆ గట్టును డాయుదునా!

అటూ ఇటూ చూచిచూచి
ఎటు తోచని మహిషి వోలె
చుప్పనాతి కొంతసేపు
చూచుచు తాదాత్మ్యమొందె—

నల్ల కలువల కనుల
నవ మన్మథాకృతిని
ఉల్లముల దోచుకొను
నల్లనయ్యను చూచి

తన చూపులను త్రిప్ప
కొనలేక ప్రతిమ యై
నిలిచి పోయిన దొక్క
నిముసమ్ము శూర్పణఖ !

శ్రీ రామ పదమంటి
శిల భామగా మారె !
కామ సుమ శరమంటి
భామశిలగా మారె !

అంతలో నపుడొక్క
వింతజరిగెను_ సీత
పంచవటిలో నుండి
బయటి కరుదెంచినది—

వెనువెంటనె కంటబడెను
పెనుభూతము చుప్పనాతి
బెబ్బులి గని నంతటనే
బెదరిపోవు జింకవోలె

జానకి హడలెత్తిపోయి
చప్పున రామయ్యను వడి
బిగ్గ కౌగిలించు కొనియె
దగ్గరగా జేర్చె స్వామి—

ప్రియురాలు తనకు తా
బిగుతు కౌగిలి కాన్క
లిచ్చుటను రామయ్య
ముచ్చటను మునిగిపో—

ఆముచ్చటను జూచి
నంతనే శూర్పణఖ
ఈర్ష్యాగ్ని సైప లే
కెగిరి పడె సీతపై

పర పురుషమోహాన
పరవశత జెందినది
స్వార్థాన తనదు ప్ర
త్యర్థిపై దూకినది.

ఆకస్మి కోపద్ర
వాపాత మడ్డుకొన
'లక్ష్మణా'! అని తత్త
రమున రఘు రాముడన,

తత్ క్షణమె లక్ష్మణుడు
రాక్షసిని వడిపట్టి
పడనెట్టి ముకుచెవులు
వడివడిగ ఖండించె

అంత రక్కసి పెద్ద
గొంతుతో నరచుచును
పరుగెత్తి తనదు సో
దరులతో చెప్పుకొనె.

తప్పు తనదై పరుల
ముప్పులో బడద్రోయు
దుర్మార్గ వర్తనుల
దుడుకు తనమే ముందు?

ఖరదూషణాదు లని
కరుదెంచి రుగ్రులయి
తోక త్రొక్కిన త్రాచు
లేకముగ దూకినట్లు.

ఏకైక వీరుడయి
ఎదురువడి రాఘవుడు
శర పరంపర గురిసి
అరి సైన్యముల గూల్చె —

జరిగినదీ విధమైతే
సరసాలాడిరి రఘువరు
లన్యకాంత తోడ ననుచు
నప ప్రథను బుట్టించిరి.

నిప్పువంటి నిజము దాచు
టొప్పు గాదు రసప్రియా !
మూక భాషలోని నిజము
లోకానికి చెప్పవయా !

మూక భాష నెరిగి గేయ
ములలో వివరించు కవీ!
నా లోపల దాగియున్న
నవతను వెలిగించు రవీ !

నాకో నిలుకడ మాత్రమె
నీకో నాలుక యున్నది
నాలుక నాల్గు యుగాలకు
ఏలికయై నిలుచున్నది.

అని నా యెద నినదించెడి
వినికిడి లో నిజమున్నది.
గోదావరి కుడి ఒడ్డున
గుట్ట ఒకటి చెపుతున్నది.

ఇదే ఇదే మైదానము
పదునాలుగు వేలబలము
రఘు వీరుని శరాహతికి
రణభూమిని హతమయ్యెను.

అదే అదే సీత గుట్ట!
అట నుండియె తిలకించిరి
సీతా సౌమిత్రులు రఘు
సింహుని రణకౌశలమును.

## సీతాపహరణము

చుప్పనాతి మాటలువిని
తప్పుడు రావణుడిచటికి
మహితనయ నపహరించ
మారీచునితో వచ్చెను.

రావణ రథ మద్రిని 'రయ్
రయ్' మని ఢీకొన్నదపుడు
ధరాధరము జడమైనను
దురాగతము నెదిరించెను.

దోపిడి నెదిరించ బోయి
రాపిడి వడి గాయపడిన
రథపుగుట్ట ఈ నాటికి
వ్యధతో కథ చెపుతున్నది.

తేటముగా పాపిటవలె
తేరుచాలు లివిగో యని
పర్ణశాల రథపుగుట్ట
పరితపించి చెపుతున్నది.

రాపుడు గాయమ్ము కన్న
దోపుడు నరికట్టలేని
మనోబాధ తననెంతో
మసలించుచునున్న దనుచు— భద్రా॥

జడశైలము లోననాడు
జాలువారె సౌజన్యము
జడమానవులందు నేడు.
జారుకొనియె సౌదర్యము.

పర్ణశాల ప్రాంగణమున సు
వర్ణ హరిణము చంగు చంగున
సీత ముంగిట జౌకళించుచు
చేరవచ్చెను మాయ మృగమది !

"ఆర్యపుత్రా! దానితెమ్మని
ధారుణీసుత కోరినంతనె
రాముడేగెను దాని బట్టగ
లక్ష్మణుడు రక్షణగ నుండగ

కొంత సేపటిలోన నే అది
ఎంతొ దూరము దాటిపోయెను
ఎంత కయినను జిక్కకున్నది
వింత మృగమది– అంత రాముడు

వాడి బాణము వేసె నంతట
లేడి రూపము దాలిచిన మా
రీచు డొరిగెను. మాయగుణమును
నీచుడీల్గుచు మాన డయ్యెను !

"హా సీత ! హా లక్ష్మ
ణా !" యనుచు రామయ్య
కంఠస్వరము తోడ
ఖలుడు గట్టిగ నరచె.

ఆర్త నాదము సీత
కశని పాతంబయ్యె !
తత్తరము జెంది గ
ద్గదిక కంఠము తోడ

"లక్ష్మణా ! తత్క్షణము
రక్షించ వెడలు మీ
అన్న ఆపద నుండె
ఆలసించక పొమ్మ"

అని పలుకు సీతతో
ననియె లక్ష్మణుడిట్లు-
"అమ్మ భయపడవలదు
అది మాయ కంఠంబు

అసుర మాయలు గాని
అన్న స్వరమది కాదు
అన్నకే ఆపదయు
అంతకన్నను రాదు.

ఆ పన్నులను గాచు
అన్న ఆపన్నుడటు
ఆర్తనాదము సేయు
టది సంభవము గాదు."

అని లక్ష్మణుడు పలుక
అవనీజ కది నమ్మ
కము కల్గదయ్యె ఓ
రిమి శూన్యమయి పోయె

పొమ్ము పొమ్మంచు సీ
తమ్మ తొందర పెట్టె!
భయ కంపితులకు ని
బ్బరము కొరవడు గాదె!

రామాజ్ఞ తలదాల్చి
లక్ష్మణుడు సీతమ్మ
నొంటరిగ వదిలి పో
కుండుటను గని సీత-

అనుమాన కలితయై
అనరాని మాటలనె.
భీతిచే బుద్ధి లో
పించి పోవును గాదె:

విధి బాధితులకు నె
వ్విధి చెప్పినను వినరు.
సందేహ నిశిలోన
జ్ఞానాంధులై కనరు.

ఈటె పోటుల కెన్న
డింత లొంగని వాడు
పోటు మాటలు సైప
కోటమికి తలవంచె!

కాళ్లాడ రాక ల
క్ష్మణు డెట్టు లెట్టులో
సీత నొంటరి దాని
జేసి కదలక కదలె!

అట లక్ష్మణుండేగె
అగ్రజుని గాని తేగ!
ఇట రావణుడు వచ్చె
కట! సీత గాని పోగ!

గడ్డి కప్పిన నుయ్యి
కరణి రాక్షసుడు పు
ణ్యాత్ము వేషము లోన
ఆశ్రమానికి వచ్చె

గోముఖ వ్యాఘ్రమై
కుటిలాత్ము డనఘాత్ము
వంచనాస్త్రము చేత
వధియించ జూచునటు

రథము దిగి తన మనో
రథము నీడేర్చు కొన
ముని వేషమున వచ్చి
జనకాత్మజను గాంచి

పసిమి మిసిమికి కళ్లు
పసరుకొను పశువట్లు
వలపు చెలరేగ రా
వణు డెంచె మదినిట్లు—

“ఏమి ఈ నిడుద కను
లేమి ఈ నిడుద చను
లెంత దీర్ఘము లంత
కంత వైశాల్యములు!

నడుము మా దృష్టిచే
నభమయ్యె నననేల?
ఘనకుచోన్నతుల దా
టునె మాదు కను దృష్టి ?

అని నింద తొలగించు
కొను యత్నమా యనగ
సోగ కన్నులు సాగి
శ్రుతులతో చెప్పుకొను-

ఏమి ఈ హరిమధ్య
మేమి ఈ ఘనజఘన
మెన్ననా పది నోళ్ల
కింత వశమే గాదు!

ఏమి ఈ లావణ్య
మేమి ఈ తారుణ్య
మెన్నెన్ని లోకాల
యెంతెంత వెదకినా
ఇంత అందము చూడ గలమ!
ఈ అందమును పొగడ గలమ!

† నెలంత మోమును బొగడ
నెలయగును, కురులెన్న
అబ్దమగు కనులెన్న
అనిమిషయుగమగు గాదె!

రతి యేమొ! లేక పా
ర్వతి యేమొ! లేక శ్రీ
సతి యేమొ లేక యె
వ్వతె ఈ మనోజ్ఞవతి?

కబరీ భరమ్ము గని
ఘనుడు కన్నీ రొలుకు
చారు ముఖమును జూచి
శశి మబ్బు మాటుగొను

తళ తళమ్మని మెరయు
ధవళ దంతపు పంక్తి
చుక్కలను చుల్కనగ
వెక్కిరించుచు నుండె—

---

† రెండర్థములు:
నెల=మాసము, చంద్రుడు
అబ్దము = సంవత్సరము, మేఘము
అనిమిషయుగము=దేవతాయుగము, చేపలజంట

అద్దాల చెక్కిళుల
ముద్దాడగా లేక
చెవిప్రక్క రోమాళి
సిగ్గుతో మెలిదిరుగు

తుమ్మెదల రెక్కలను
తూలనాడెడు కురులు
కనబోవు కలువ మొ
గ్గల గేలు వాల్గనులు

మల్లె మొగ్గల వంటి
తెల్లనగు పలువరుస
చిరునగవు లొల్క బో
సెడు చిగురు పెదవులుసు

నిండు పున్నమి శశిని
నిరశించు నెమ్మొగము
నల్ల కలువల మించు
నయనాల సోయగము

స్తనమండలము మీద
సయ్యాడు మణిహార
మది దాని భాగ్యమే
మని పొగడగలవాడ!

క్రొంజెక్కుటద్దాల
కుండలంబుల ధగ
ధ్ధగలహో! నాదు నే
త్రముల మిరుమిట్లుగొనె!

కఠినమై వట్రువై
గట్లవలె యెత్తెదిగి
ఒత్తుకొని యొండొరుల
యొరసికొని బరువుతో
కొంచముగ కదలాడు
గురుకుంభకుచయుగము

పుడమినే తలదన్ను
వెడదైన జఘనమ్ము
బలవంతులకు మధ్య
వడకు పిడికెడు నడుము

అర్క చంద్రులు లేని
అదనుచూచుక సంధ్య
నాక్రమించెడు కటిక
చీకటి విధము రావ
ణాసురుడు రామరా
మానుజులు లేనట్టి
సందుచూచుక వచ్చినాడు
జానకిని గొనిపోగ వాడు!

భిక్షాందేహి ! యటంచు
బిగ్గరగా అరచినాడు
భిక్షనొసగ వచ్చు దయా
లక్ష్మిని చెఱపట్టినాడు.

భిక్షాటన సేయువారు
భిక్షకులా ! భక్షకులా !
పడతి కొఱకు పదవి కొఱకు
పలురంగులు మార్చెదరా ?

ఏ క్షణాన ఏ వేషం
ఏ క్షణాన ఏ మోసం
ఈ నాటికి ఆ నాటికి
ఏమున్నది వ్యత్యాసం !

వ్యామోహం నానాటికి
సామాన్యంబైన దనుచు
ఆనాటిది రథపుగుట్ట
ఈ నాటికి చెపుతున్నది. ॥భద్రా॥

క్షణమాత్ర మిట్లు రా
వణుడు మది తలపోసి
మరుక్షణం బిటనుండ
మంచి కాదని యెంచి

ఒకచేత కురుల వే
రొక చేత నూరువుల
బట్టుకొని సీతగొని
పై కెగసె రథముపై

మబ్బులను గాడ్పులను
మాయచే గల్పించి
జగము కనుగప్పి ఖలు
డెగసె వైదేహి గొని

"హా రామ! హా లక్ష్మ
ణా!" యంచు గద్గదిక
కంఠమున సీత బి
గ్గర ఏడ్వగా సాగె!

తనువు జెవజెవ లాడ
మనసు విలవిల లాడ
పులినోట జిక్కుకొని
కలఁతపడు హరిణమటు

లంకేశ్వరుని చంక
లలితాంగి చిక్కికొని
గజగజమ్మని వణకి
కలఁగుచును విలపించె!

సీత తన గళమెంత
చించుకొన్నను గాని
వినరాదు రామ ల
క్ష్మణుల కది రవ్వంత

కూతపెట్టది కాదు
సీత కంఠము వినగ
మారీచు మాయ కం
ఠారవమ్మది కాదు

"హా రామ! హా రామ!
హా లక్ష్మణా!" యనుచు
ధరణీ తనూజ రో
దన మెంత దుస్సహము!

కన్నీరు పెట్టుకొని
కాన దేవత లేడ్చె
మృగ సమూహంబెల్ల
దిగులుతో వగజెందె!

రోదనా వేదనము
లో రగులు బడబాగ్ని
కెవడోయి పాషాణ
దవని కరుగని వాడు ?

గర్భశోకాగ్నిచే
కమలి పోయెననంగ
భూదేవి గుండె లిట
*బొగ్గు గనులై పోయె !

దౌర్జన్య మరికట్ట
దనుజు వెంటాడునన
దక్షిణకు పారు గా
తమి నేటి కిచ్చోట.

అక్రమము నెదురుకొన
నలవి కాకను మేఘు
డేడ్చు నీనాటి కన
ఇట వాన లధికమ్ము.

---

*రథపుగుట్టకు సమీపంలో మణుగూరు బొగ్గుగనులు.

భూదేవి నిట్టూర్పు
లోదార్పు బడకుంట
ఉష్ణమ్ము గ్రీష్మాన
భీష్మమై పోయెనిట

అవనిసుత విలపించ
అద్రు లేడ్చిన వనగ
గిరులందు జనియించె
ఝరులు నానాటికిని !

అట్లాట స్తంభాద్రి
ఆర్ద్రమై పోయెనొకొ:
జలజలా గోదారి
శబరి కిన్నెరసాని
మున్నేరు శోక్లేరు
ముంేరు తాళిపే
రిత్యాది నదులు ప్ర
హించు నీనాటికిని !



— నా భద్రగిరి శతకమునుండి

మ॥ ఇట లంకేశుడు సీతనెత్తుకొని
పోయెన్ గర్భశోకాగ్ని క్రిం
గుట భూదేవికి గుండియల్ గమలి
బొగ్గున్దేర 'కోల్ మైను' లి
చ్చట వర్ధిల్లె - పరోపకార మొన
గూర్చన్ సజ్జనుల్ మాన రెం
తటి సంతప్తులునైన భద్రగిరి
సీతారామచంద్ర ప్రభూ॥

మ॥ ఇట గోదావరి దక్షిణాభిముఖమై
యేతెంచుటన్ జూడ ప్ర
స్ఫుటమౌ, సీతను ముచ్చిలించుకొని
పర్వెల్దియు లంకేశుఁ బ
ట్టుట కీలాగున వెంటబడ్డదని
చాటున్గాక ! దౌర్జన్య మం
తట రుద్ధంబగుగాదె ! భద్రగిరి
సీతారామచంద్ర ప్రభూ॥

మ॥ ఇట సీతన్ దనుజుండు దొంగిలిడె
నంచీ భూమి నిట్టూర్చునో !
కట ! మేఘుండదిగాంచి యేడ్చునో !
మహోగ్రస్థాయి నింజెందె ని
చ్చటి ఉష్ణోగ్రత వర్షపాతములు !
వానంబుంటి వీ గౌతమీ
తటి నమ్మేలగ స్వామి ! భద్రగిరి
సీతారామచంద్రప్రభూ॥



# పర్ణశాల

## ద్వితీయాశ్వాసము



# పర్ణశాల

## జటాయువు

వేదనా రోదనము
వీనులకు సోకగా
విహగేంద్రు డులికిపడి
వీక్షించె నలు దిశల

వృక్షంబుపై నున్న
పక్షి నాథున కంత
కంటబడె నబల నొక
కంటకుడు గొనిపోవ

ఫెళఫెళమ్మని పక్ష
ములు విప్పి కొమ్మనిల
దన్ని పై కెగసి ఆ
పన్న గావగ వచ్చె-

"ఎవడురా ! అబలన
ట్లవమానగతి బల
తా్కరముగ బట్టికొని
పారి పోతునా్నడు ?

ఎవడైనకాని చెడు
నెదిరించెదను గాక!
ఆపన్న ఎవరైన
ఆదుకొనెదను గాక!

అవురవుర! రావణుడు
అక్రమముగా రామ
పత్ని సీతమను చెఱ
బట్టి నట్లున్నాడు"

"రావణా! ఆగు దు
ర్మార్గంబు తగదురా!
పరదార గొని పోవ
పరమ నీచము గదర!

శివుని మెప్పించి రం
జిల్లు కీర్తి గడించి
పరదార మోహమె
క్కరణి గలెను నీకు?

నీ వలెనె యెవడేని
నీ సతిని చెఱబట్ట
నెట్లుండు నీకు ఊ
హించుమో రావణా!

పరదార పరధనము
పర భూములను దురా
క్రమణమ్ము సేయ ము
ష్కర వృత్తి కాదటర?

తనవారు లేనట్టి
తరుణంబు జూచుకొని
అసహాయ నబల ని
ట్లక్రమంబుగ దోచ

అవమాన మవమాన
మవమాన మిది నీకు
నీచ కార్యము సేయ
నీకేల తగదురా!

నామాట విని రావ
ణా ! సీత నిట దించి
పొమ్ము వేగమె పౌరు
షమ్ము గాదిది నీకు.

క్షాత్రమ్ము బ్రాహ్మ్యమ్ము
సమముగా పాటించు
నీబోటి పండితున
కే పాటి నే చెప్ప!

సకల శాస్త్రమ్ములను
చదివితివి సకల ధ
ర్మాధర్మములు నీకు
బోధకములే కదా !

పక్షీంద్రుదు సూక్తులను
లక్షింపకను రావ
ణుడు రథమ్మును వడిగ
నడిపించు కొనిపోవ

పృథివీ తనూజ విల
విలలాడి విలపించ
గుబులుతో పక్షీంద్రు
గుండె తరుగుకు పోయె !

" నిలువరా ! నిలువరా !
నీచుడా ! నిలువరా !
నీ పీచ మడగింతు
నాపన్న రక్షింతు.

నా బొందిలోన ప్రా
ణము లుండు నందాక
పోనీను సీతగాని
పోనీను పోనీను

మానవుడవా కావు
దానవుడ వీవు గద !
మంచి మాటలు నీకు
మతి కెక్కనే రీతి ?

మంచి బలహీనతగ
నెంచెదరు నీ వంటి
తుచ్ఛకులు, పందులకు
నచ్చునా పన్నీరు ?

మంచి మాటకు గాక
మర్దనమ్మున గాని
మంచి మార్గమ్మునకు
మహిషాధములు రారు

తెలియని అవజ్ఞునకు
తెలుప వచ్చును కాని
తెలిసిన అవజ్ఞునకు
తెలుప శక్యము గాదు

వంచకాధమ ! నీకు
వడ్డింతురా రమ్ము !
అంగుళంబైన ముం
దంగ వేయగ లేవు.

వార్ధక్య భారమున
వడకు నా మేను నీ
దుడుకు తనమును జూచి
ఉడుకెత్తి పోయెరా !"

అని ఖగేంద్రము రావ
ణాసురుని పై దూకి
గోళ్ళ ముక్కున బొడచి
ఘోర సమర మొనర్చె.

అంకుశంబెత్తి మద
హస్తి బొడచెడు మావ
టీడట్లు ఖగము బీ
డించసాగెను ఖలుని.

శరపరంపర గురిసి
చండించె రావణుడు
అండజాధిపు తనవు
నిండ గాయము లయ్యె!

అయిన రవ్వంతయును
అలుపు సొలుపును లేక
తెగియించి ఖగరాజు
జగడించగా సాగె!

వృద్ధుడైన జటాయు
వెనుకాడకను యౌవ
నోద్దండ దండ ప్ర
కాండ చండు నెదిర్చె.

కడువాడి చుంచూ న
ఖాలతో రావణుని
తనువెల్ల బొడచి పీ
కెను కండలూడిపడ

తల కిరీటము డొల్లె
తల వెండ్రుకలు చెదరె
రావణుని మేనెల్ల
రక్తసిక్తం బయ్యె-

రాక్షసుడు ఢీలుపడె
పక్షి విజృంభించె
వనదేవతలు జూచి
మనసార హర్షించె!

అంత దానవు డలిగి
పంతంబు బూని చం
కను బట్టుకొన్న సీ
తను దించె నొక్కెడను

ఝణ ఝణమ్మని కత్తి
ఝళిపించె రావణుడు
కణకణమ్మని రెక్క
లను విదల్చెను వేగ!

సొడసొడమ్మని రుధిర
మొడసి ఖగపతి త్రుళ్ళ!
జలజలమ్మనె అశ్రు
వులు సీత చెక్కిళ్ళ!

రణభూమి తడిసి పో
యెను పక్షి! రక్తాన
కన్నీటి కాలువల
కడిగెరా భూసూన!

ఖడ్గ ప్రహారాల
ఖగమెంత గాయపడె!
కాని వెనుదీయ దిం
తేని రణరంగాన!

ఆయుధుడు దైత్యుడు ని
రాయుధుడు ఖగరేడు
వయసున్న వాడు రా
వణుడు - వృద్ధు జటాయు.

ఖలుడు దాలిచె కవచ
ఖడ్గాలు - ధర్మ మా
నవతలే ఖగపతికి
కవచ ఖడ్గాలయ్యె!

ఏండ్లు పైబడినట్టి
పండు ముదుసలిపక్షి
ఉస్సురోయని తెస్స
డస్సి పోయిన దకట!

పక్షి వెనుదీసెనా
రాక్షసుడు ముందరుగు
మానవత మడిసెనా
దానవత చెలరేగు!

ఖండన శ్రమ చేత
అండజుని వడితప్పె!
నెత్తురోడయుట చేత
మత్తు కన్నుల గప్పె!

బలదర్పమున దైత్యు
డలరారి ఝృంభించె!
అలసి సొలసిన డేగ
బలహీనుడై పోయె!

ఐనలొంగ డొకింత
యేని విహగేంద్రుడఖి
మానధన రక్షణకు
ప్రాణముల బలిపెట్టు!

తూలుచును సోలుచును
ఆలంబు సేయు విహ
గేంద్రు దుస్థితి గాంచి
యేడ్వ సాగెను సీత !

తనకొరకు పోరాడి
తనువెల్ల గాయాల
తోనిండి తూలుచును
ధూర్తుపై దూకుచును

డస్సి పోయిన డేగ
ఉస్సు రుస్సురు జూచి
సీతమ్మ నయనాల
సింధువులు ప్రవహించె!

దిగులుచే బొగలి తన
దిక్కు జూచుచు సీత
కంట జలజల బాష్ప
కణజాలములు రాల్చ

దీనార్తయైన ధా
త్రీజ మొగమును జూచి
గుండె చెరువై పోయె
అండ జాగ్రణి కపుడు :

దీనావ నార్థమై
మానవత తనలోన
పొంగార ఖగరాజు
భూజతో నిట్లనియె_

"దుఃఖించ కోతల్లి :
దుర్బలుడ నైతి నని
బొంది ప్రాణాలుండ
పోనీను నిన్నుగొని :

బిగుతేల దిగుతేల
భూమిజా ! రావణుని
పోనీను పోనీను !
పోనీను నిన్నుగొని !

కంట తడి పెట్టకో
కన్నతల్లీ ! నీదు
కష్టాలు కడతేర్తు
కంటకుని బరిమార్తు!"

అని లేని శక్తిపెం
పును జేసికొని జటా
యువు పోరు సలిపె శ
త్రువు తోడ తెగియించి

ఖడ్గ ధార లవెంత
ఘాతుకంబైన తె
క్కించ కెదురించె ప
క్షీంద్రు డా రాక్షసుని.

అంత రావణుడలిగి
అదనెరిగి కీ లెరిగి
ఖడ్గంబుతో పక్షి
కాళ్లు రెక్కలు నరికె

భూధరమ్మటు భూమి
బొరలి పడెను జటాయు !
అమరుడై సమరాన
అతడెంత దీర్ఘాయు !

పరుగు పరుగున సీత
పరుగువెత్తి పక్షీంద్రు
కౌగిలించుక యేడ్చె
కన్నీరు కడలిగా –

“నన్ను రక్షింప మా
నాన్నా ! జటాయూ !
నా కొరకు యిట్లైతి
వా ! కన్నతండ్రీ !

నా కొరకు పోరాడి
నను గన్న తండ్రీ!
ప్రాణాలు బలివెట్టి
పడిపోయినావా !

నను గన్న తండ్రి ! మా
నాన్నా జటాయూ !
నీ ఋణమ్మది దీరు
నే జన్మలోనా ?"

ఎదబాదు కొనుచు వ
య్యెద బాష్పములు రాల
అకటకట ! సీతమ్మ
అంగ లార్చుచు ఏడ్చె !

ఖగనాథు మీదఁబడి
దిగులుతో బాగులు సీ
తను బట్టు కొనగ రా
వణుడు జేరగ రాగ

గజ గజా వణకుచును
కాళ్లాడకను సీత
ఎట్లెట్లొ పరువెత్తి
చెట్లనే పట్టుకొనె!

ఖలుని దౌష్ట్యము గాంచి
కనుల నిప్పులు రాల
"ఘాట ఘాట" ధ్వనుల
ఘర్షణల గావించి

ముద్ధయై పడినట్టి
మూర్ఛలోని జటాయు
ముష్కరుని డీకొనగ
మొగిసె తలపై కెత్తి!

భళి భళీ! ఖగవీరు
పౌరుషం బేమందు
పడిపోయి గూడ తల
పై కెత్తు రిపు ముందు!

కాళ్లు రెక్కలు దెగిన
ఖగము కదలగ లేక
మెడసాచి ముక్కుతో
ప్లేచ్చు బొడవగజూచు

మూర్ఛాంధ కారమున
మునిగి పోవుచు రుధిర
మున దొప్పదోగి దై
త్యుని బొడవగా జూచు

కనుల మైకము గప్ప
కొన ప్రాణముల తోడ
దనుజు నెదిరించి సీ
తను గావగా జూచు

పక్షి పౌరుష మెంత
ప్రస్తుతించెద మన్న
యెద పొంగునే కాని
పదములే కొదవయ్యె!

నిస్సహాయను బలిమి
నిర్జించి పట్టుకొని
రథము నెక్కించుకొని
రావణుడు పైకెగసె !

సీతమ్మ సిగలోని
సిరిమల్లియలు రాలి
రావణాసురు మిత్తి
రాక బాటను దెలిపె !

విలపించు సీతగాని
ఖలుడెగసి పోయెరా !
వనకాంత మూగదై
వలవలా యేడ్చెరా !

కానతరు జంతువులు
కంట తడివెట్టెరా !
ధర్మదేవత మూగ
తనము పాటించెరా !

దాన వత్వము చేత
మానవత మడిసెరా !
బలునిచే దుర్బలుని
బ్రతుకంత సమసెరా !

దౌర్జన్యమే గెలిచె
దాక్షిణ్యమే ఓడె !
కార్పణ్యమే రేగ
కారుణ్యమే వీగ !

పశు బలమ్మున కింత
బలమెట్లు కలిగెరా !
మానవత బ్రతుకెంత
హీనమై పోయెరా !

ధర్మ వీరుం డిట్లు
దండింప బడుటేల
మంచికై బోవచెడు
వంచించగా నేల ?

విహ్వాలను రక్షించు
విహగేంద్రు డట్లయ్యె !
రక్షించు వాని విధి
శిక్షించగా నేల ?

మానవత కింత టవ
మానమది యేలకో !
దానవత కింత బల
దర్పమది యేలకో !

అకటకట ! ధర్మమ్ము
ననుకరించెడు సుజను
డన్యాయమై పోయె !
అవమానమై పోయె !

హర హరా ! అవినీతి
కడ్డుపడు వాడెవడు ?
అడ్డుపడు వీరుడ
ట్లై పోవ దిక్కెవడు ?

మానవతాగళము
ధర్మమును పాటించ
దండింపగా బడున?
తులువ పనులను సేయ!
గెలుపు చేకూరునా ?

అదికాదు అదికాదు
అదియెన్నటికి కాదు
ఆపన్నలను గావ
అన్యాయ మెదిరించి
ధర్మయుద్ధము నందు
ధైర్యంబుతో పోరి
అపజయము నొందినా
అసువులను వీడినా
అదె ధర్మ విజయమౌ!
అతడె దీర్ఘాయువౌ!
అందుకే వినిపించు
అమృతాత్మ గాథ!!
పరమ వీర జటాయు
బ్రహ్మయు గాథ!!

ఇలయందు సూర్య చం
ద్రుల యందు మెరయుచు
క్కల యందు కురియు మే
ఘములందు పొంగారు
ఝురులందు రంగారు
గిరులందు యుగ యుగం
బులనుండి యెట్టి మా
ర్పులు లేక యున్న చం
దాన మానవులందు
దానవుడు మానవుడు
ధరణి బుట్టుట ప్రకృతి
ధర్మమై విలసిల్లు.
ఇది రేబవళ్ల వలె
ఎడతెగక వర్తిల్లు.
తగని పని సేయుటే
దానవుని నైజమ్ము
దాని నెదిరించుటే
మానవుని ధర్మమ్ము
దౌర్జన్య మెదిరించరా !
మానవుడ !
ధర్మమ్ము రక్షించరా !

అవనిపై అందుకే
ఆనాటి కీనాటి
కన్యాయ మెదిరించి
ఆర్తులను కరుణించి
ఓదార్పు గురియించి
వేదనాగ్ని శమించి
పీయూష మొలకించి
బీడులను ఫలియించి
దుష్టులను శిక్షించి
శిష్టులను రక్షించి
వంచనము నిరసించి
మంచినే ప్రేమించి
జడములను చివురించి
జగమునే మురియించి
జాతి భేదము త్రుంచి
సమతనే పాటించి
దాక్షిణ్య మెదనుంచి
ద్రవియించి ద్రవియించి
విధిపీడితుల గాంచి
విలపించి విలపించి
శ్లోకమై వినుపించురా !
మానవత
లోకాల కదలించురా !!

ఆనాటి సీతమ్మ
ఆక్రందనము నేడు
నరరూప రాక్షసుల
కెరయగుచు విలపించు
వెలదిలో విధియోగ
జలధిలో కన్నీటి
చితుకులో కడగండ్ల
బ్రతుకులో రగిలేటి
విలయాగ్నిలో విపద
ప్రళయాగ్నిలో ఎడద
యెడదలో జ్వలియించు
బడబాగ్నిలో ఆర్త
నాదమ్ము వినిపించురా !
మానవత
ఆర్ద్రమై ప్రవహించురా !!
విహ్వలను రక్షించు
వీర ధర్మము నెంచి
అబల నెత్తుక పోవు
అసురుపై దండెత్త

వీర కారుణ్యాలు
విధినడ్డి కడలెత్త
రాక్షసత్వము మీద
రౌద్రమ్ము శివమెత్త
రాతిగుండెలకఱకు
రక్కసుం డడలెత్త
గర్జించి నిర్జించి
ఖలునితో జగడించి
దుర్బలను పీడించు
దుర్మదుని ఖండించ
ధర్మ యుద్ధము నందు
తన తనూ ప్రాణముల
బలివెట్టి పోరాడెరా!
ఖగరాజు
పశుబలమ్మెదిరించెరా!!
దీన రక్షణ కొరకు
మానవత్వమ్మెడద
ద్రవియించి ద్రవియించి
ధర్మ రణ రంగాన

పొంగారు గంగాత
రంగ ప్రవాహినీ
సంగీత జనితమౌ
మంగళ ధ్వనులతో –
కరుణాంత రంగ ని
ర్ఝరిణీ తరంగ సుం
దర మాధురీ విశ్వ
మురళీ రవమ్ముతో –
వినిపించు వినిపించు
వినిపించురా! కవుల
కలమందు గాయకుల
గళమందు ధర్మ వీ
రుల గాధ జాలి గుం
డెల బాధ బోధగా
వినిపించురా! విశ్వ
విమల కీర్తి విపంచి!
నినదించరా త్యాగ
నిరతిలో నీమంచి
దీనావనార్థమై
ప్రాణాలు బలివెట్టు

వీరావతారుడా
విహగ వీరుని గాథ:
ధీర వీర జటాయు
దీర్ఘాయు రణగాథ:
వినిపించు వినిపించు
వినిపించురా విశ్వ
ఘోషలో విశ్వజన
భాషలో సితకీర్తి
యోషానురాగ పీ
యూష ప్రత్యూషలో
వినిపించురా! విశ్వ
విమలగాన విపంచి:
నినదించరా త్యాగ
నిరతిలో నీమంచి::
అబలార్త నాదాని
కార్ద్రమైన జటాయు
సమరాంగణములోన
అమరుడైన చిరాయు
యుగయుగంబుల నుండి
జగదేక వీరుడై

విలసిల్లు పగిది భా
సిలు వీరవరునికై
భువనాలు జయపెట్టురా!
గళమెత్తి
కవనాలు కీర్తించురా!!

ఆ నాటి కీ నాటి
కే నాటికైన ధర
నరులందు ఖగపతికి
సరిబోలు వారెవరు ?

వినరాని కనరాని
విపినమ్ములో నాడు
అబలార్త నాదమ్ము
నాలించె పికరేడు

నారీ విలాపమ్ము
నడివీధిలో నేడు
కనివినియు మానవుడు
కదలి ముందుకు రాడు

ఆనాడు సీతాప
హరణము నిరోధించి
పక్షియై రాక్షసుని
పశుబలమ్మెదిరించె !

కాని ఈనాడబల
మాన భంగాది దు
ర్మార్గంబు నెదిరించ
రాడేల మానవుడు !

మాన భంగమ్ము రా
మాయణములో వినము
కాని నేడా వార్త
లేనిదేదీ దినము ?

అనుమతించని స్త్రీని
పహరించుయు గూడ
కమమెమ్మనరించ
చకుడైనను గూడ

అట్టి దానవ నీతి
అణువైన లేదయ్యో
మానవా! నీ కన్న
దానవుడె మేలయ్యో!

ప్రకటించుకొన్నావు
సకల జీవులలోన
ఉత్తమోత్తముడనం
చుత్తుత్త మాటలవి!

మానవాకృతి యంద
మానుషము కనుపించు
మానవత్వాని కవ
మానమ్ము కలిగించు

కుక్షి కౌఱకా కాదు
కక్షతో ఈ నాడు
రాక్షసుండై నరుడు
పక్షితో సరిరాడు

ప్రేక్షకులు లేనట్టి
విపినమ్ములో నాడు
ఆర్తకై అసువులే
అర్పించె పికరేడు

కీర్తి కొరకే కాని
ఆర్తికై యెవ్వాడు
ప్రాణాలు బలిపెట్టు
పక్షీంద్రుని వలె నేడు ?

తన జాతిగాని సీ
తమ్మకై మరణించు
ఖగము సౌహార్ద్రమ్ము
జగమునే మురిపించు !

సౌహార్దమను మాట
సామాన్యమై పోయె!
సమయమ్ములో దాని
సహజమగు పడదాయె!

సౌభ్రాత్రమని పలుకు
సహజముగ ప్రతివాడు
సమయమ్ములో ఖగ
స్వామియౌ నెవ్వాడు ?



దురాక్రమించు ధూర్తుపై  పరాక్రమించు ఖేచరా !
ధరిత్రి మానుషమ్ము నీ చరిత్రతో తరించెరా !



— నా భద్రగిరి శతకము నుండి

మ॥ మును పిచ్చోట జటాయు రావణునితో
పోరాడుచున్ గూలి రా
ల్చిన క్రొన్నెత్తుటిచుక్క లీకెలివి
మిర్చిధూమ్ర పత్రాకృతుల్
గని ద్రవ్యాయుధమూని గాటనెడి
కక్షన్ ఘోరదారిద్ర్యమన్
దనుజున్ గూల్చనుగాదె! భద్రగిరి
సీతారామచంద్రప్రభూ!

మ॥ ఇదె గోదావరి పర్ణశాల యిదె:
ఇందే జానకిన్ ద్రుంచ్చలిం
చె దురాత్ముండు, దురాగతం బెదుర
పక్షిన్‌జంపె నిచ్చోట నం
చెద నొవ్వన్ నదికన్రుపుల్ వరదలై
ఈనాటి కష్టప్రత్య
త్పదముల్ దాకగ జూచు భద్రగిరి
సీతారామచంద్రప్రభూ!

# పర్ణశాల

## కీడునీడలు

ఆకాశ మార్గాన
అసురు డెత్తుక పోగ
సీత పచ్చని పైట
చెంగు రెపరెప మనుచు
ప్రజ్వలించెడు జ్వాల
పగిది రావణు గప్పె
టను జూడ భగభగ
మ్మను మండు కొండవలె
అగుపించినాడపుడు వాడు!
అది అరిష్టాకరము చూడు!

పతివ్రతను చెఱపట్టు
పాపి యట్లే మండి
చచ్చునని మునుముందు
వచ్చు కీడును దెలిపె.

పసిడి తీగెనుబోలు
పడతి సీతాదేవి
పసిడిగోలు సట్లు రా
క్షసుని రొండిని చుట్టు

బంగరువు కక్షచే
బంధింప బడినట్టి
కరి భంగి కనిపించె
ఖలుడు రావణుడపుడు !

సీత కట్టిన పట్టు
చీర హాటకరుచిని
సూర్య కిరణాలచే
శోణకృత మైపోయి
మధ్యాహ్న సమయాన
మబ్బొబ్బబడీ నట్లు
అగుపించె నదిగదిగొ చూడు !
రగిలినది రాబోవు కీడు !

ధర్మక్షయంబైన
తరుణమున తారకలు
తళతళమ్మని మెరసి
ధరణిపై రాలినటు
మణిమయాంచిత కనక
మండితా భరణములు

మధుర మధుర ధ్వనుల
మహిమీద రాలిపడె !
అది అరిష్టాకరము చూడు !
అరయుడది రాబోవు కీడు !

చంద్రహారము సీత
చనుదోయి మధ్యమున
తెగిపడెను భువిమీద
దిగివచ్చు గంగవలె
పావనిసి చెఱబట్టు
పాపి రావణు బ్రతుకు
గంగపాలై పోవ
నంగ సూచన చేసె !     ॥అది॥

రావణుని మరణ వా
ర్తను ముందుగా దెలుప
నోయనగ మధుర ధ్వ
నులు సృష్టి సలుపుచును
వడివడిగ గుండ్రముగ
సుడులు వడ దిరుగుచును

చెసటిద్రుంచగ సుద
ర్శన చక్రమో యనగ
సీత పాదాబ్జ మం
జీర మది జారిపడె ॥ ॥అది॥

అగ్ని కాంతిని బోలు
ఆభరణముల తోడ
అపరంజి బొమ్మ సీ
తమ్మగొని రావణుడు
కొఱవిగొని తన యింటి
కరగు చున్నటు దోచె ॥ ॥అది॥

మేఘమ్ములో మెరుపు
మెరసినటు రావణుని
వడిలోన సీతమ్మ
వణకి పోవుచునుండె

పెనిమిటిని యెడబాసి
దనుజు ఒడిలో సీత
కాడ వీడిన యట్టి
కమలంబువలె దోచె ॥

మేది నీ సుత ముఖము
మేఘమును జీల్చుకొని
వచ్చుచున్నట్టి శశి
వలె గానుపించినది.

ముద్దారు నునుపైన
అద్దాల చెక్కిళులు
చెంగలించుచు నొసట
చెన్నారు ముంగురులు
తళతళమ్మని మెరయు
ధవళపుగు పలువరుస
సంపెంగ మొగ్గతో
సరిబోలు నాసికయు
పక్వబింబ ఫలంబు
వంటి బింబాధరము
గల సీత ముఖబింబ
మలతతో పగటి చం
ద్రుని వోలె తెల్ల బో
యిన దక్కటక్కటా!

మురువులొలికెడు నుదుట
ముంగురులు జీరాడ
అద్దాల చెక్కిళ్ల
అశ్రువులు పారాడ
ఘన బిడాలము పట్టు
కొనిన కీరము వోలె
చెనటి చే పట్టువడి
పెనగులాడుచు సీత
హీన స్వరమ్ముతో
దీనయై విలపించె!

సెలయేళ్ల కన్నీళ్ల
జలజలలతో గిరులు
గాలి తాకిళ్ల కగు
గలగలలతో తరులు
సీత భయపడ కనుచు
చేతులెత్తుక ధైర్య
మును జెప్పుచున్నట్లు దోచు!
వన దేవతలు చూచి యేడ్చు!

ఆకసమ్మున బోవు
అవనిజ నీడ గని
ఆ వెంట పరువెత్తె
అడవి మృగములు గూడ!

సీతకై చేత నా
చేతనము లేడ్చినవి!
భూత దయగల దఖిల
భూతములలో గూడ!

తన వంశజుని పత్ని
దనుజుండు పట్టుకొని
పోవుటనుగని తెల్ల
బోయె రవి దీనుడై!

కోడిపిల్లను గ్రద్ద
కొనిపోవ వెంటాడు
తల్లి వలె సీత గొని
తరలు రావణు వెంట
బడి పెద్ద మృగము లవి
పరువెత్తగా సాగె

పశు బలమ్మెదిరించు
పశు మృగాదులు గూడ
చేతనా స్పృహ గల్గె నేని !
సింహమై పోవు ప్రతిప్రాణి !

పిల్ల మృగములు మిగుల
భీతిచే కంపించి
జాలి మోములు బెట్టి
జలజలమ్మని పొరలు
కన్నీరు మున్నీరు
గా నేడ్చుచును రెప్ప
వాల్చకను పై దేహి
వంకనే జూచినవి !
నిస్సహాయుల బ్రతుకు
లుస్సురోయని యిట్లె
కన్నీళ్ళ పాలగుచు నుండు !
కరుణతో యెద పొంగుచుండు !
దుర్బలుని బ్రతుకుతో
దోబూచు లాడెదరు
నిర్భాగ్య జీవి క
న్నీ రొలుక జేసెదరు

కాని ఇది తాత్కాలి
కపు గెలుపు మురిసెదరు.
చుల్కనగ కత్తినే
నాల్కతో నాకెదరు.

ప్రతి అశ్రు కణములో
బడబాగ్ని చెలరేగు
ప్రతి గుండెలోన కుం
పటి మండి పొగరేగు
పాపఫలమది పండవలయు!
పంటకై వ్యవధి కావలయు!

అసురు డంబర వీథి
అవనీజ గొనిపోగ
పెనుగాలి తాకిడికి
అనటివలె వణకుచుమ
పెనుగులాడుచు మొత్తు
కొనుచు నరచుచు రామ
లక్ష్మణుల బిలచుచును
రమణి కంటికి మంటి

నేక ధారలు గట్ట
యేడ్చుచును దీనయై
మాటి మాటికి సీత
మహివైపునే చూచు !

జనక సుత గోడుగో
డున యెంత యేడ్చినా
ఎవరడ్డు పడరారు !
ఏమందు విధివ్రాత !

కట కటా ! సీతమ్మ
కష్టాలు వర్ణించ
భయకంపితములగుచు
పలుక లేవు పదాలు!

వాలు గన్నుల నుండి
నేల కూతురు రాల్చె
అశ్రవులుగావు అవి
అగ్ని కణములు గాని !

అబలా శ్రుకణములో
అణ్వాస్త్రమే యుండు
రవ్వంతదై మిణుగు
రగిలి చిచ్చగు చుండు
పాపఫలమది పండవలయు!
కాపుకై వ్యవధి కావలయు!

దిక్కుమాలి దీనయగుచు
దృక్కుల కన్నీ రొలుకగ
గట్టిగ విలపించు చుండ
దిట్ట తనముతో సీతను
అంతరిక్ష మార్గంబున
అసురుడెత్తుకొని పోయెను
ఏడున్నదిరా ధర్మం?
ఏదీ అదియెటు బోయెను?

రాలు గరగు కంఠముతో
రామ లక్ష్మణుల బిలచుచు
జల జల కన్నీటి ధార
జడివాన విధాన గురియ

బిగ్గరగా విలపించుచు
స్పృహ దప్పుచు పడిపోవుచు
ఉరగాంగన వోలె మెలిక
దిరిగి పోవు సీతమ్మను

కేశములను బట్టుక లం
కేశు డీడ్చు కొని పోయెను !
పరదారను చెఱబట్టుక
కొరవి వెంట కొనిపోయెను !

కేశములా కావవి యము
పాశములై చెదరె ననగ,
కురులా కావవి నల్లని
ఉరగములై చెలగెననగ,

దనుజుడు తన మృత్యువునే
తన వెంటను కొనిపోయెను
మెడను రాయి బిగియించుక
జడధి నీదగా దూకెను.

భుజము దొలగి గాలి కెగురు
భూసుతి చేలాంచలంబు
ఉల్కా పాతంబు వోలె
వ్యోమ పథంబున దోచెను

అని చెప్పుచున్న దిపుడు
అదే 'రథపుగుట్ట' దాని
మూక భాషలోని భావ
మును దెలియగరాదు కాని,

నమ్మిన నమ్మక పోయిన
నగ్న సత్యమే చెప్పను.
ఇందుకు రుజువున్న దొకటి
ఈ నాటికి అగుపించును.

అదియేమన అవనీసుత
అశ్రుకణా లిపుడిచ్చట
గోదావరిబడి నేటికి
నోదారువు బడకుండుట
*జల విద్యుత్ కేంద్రములయి
జనహిత కారకములగుచు,

---

*మణుగూరు భారజల కర్మాగారం పాలీనా రెండు వందల టన్నుల భారజలం ఉత్పత్తి చేస్తుందని — ప్రధాని.
ఈనాడు : 15-7-84

'దగ్ధేంధన వహ్ని' యనెడి
ధర్మము ప్రకటించుననుచు,

గోదావరి కుడి ఒడ్డున
గుట్ట ఒకటి చెపుతున్నది.
భద్రాచల సీమలోన
పర్ణశాల ఒకటున్నది.

## అపశకునములు

అరెరె ! నా బాణహతు
డైన ఈ మాయావి
అచ్ఛముగ నా కంఠ
మనుకరించుచు నరచి,

హా సీత! హా లక్ష్మ
ణా ! వేగ రక్షింపు
డనుచు నాస్వరముతో
ఆర్త నాద మొనర్చె

మాయచేసెను నీచ
మారీచు డకటకట !
వీని మాయలకేమి
హాని మూడునో కదా !

ఎంతపని జరిగె నిపు
డేమి సేయుదును నా
యెడమ కన్నదరె నా
యెడద కళవళ మొందె!

వెనుక తట్టున నుండి
వికటముగ నక్కఱచె
ఎడమ వైపుగ పక్షి
మృగము లేగుచు నఱచె!

ఘోరా పశకునములు
గోచరించుట జూచి
ఏమైరో! జానకీ
సౌమిత్రు లక్కటా!
ఏకీడు మూడెనో!
ఏమి సేయుదు ననుచు
వ్యాకుల స్వాంతుడై
వడివడిగ పర్ణశా
లకు వచ్చుచుండగా
లక్ష్మనుని పొడగాంచి,

"అల్లదిగో ! లక్ష్మణుడు
అరుగు దెంచుచు నుండె
అనుమాన మెల్ల నిజ
మై పోయి నట్లుండె !

ఆపదను శంకించి
అవనీజ పంపెనో !
తానంప లక్ష్మణుడు
తరలి రానేలకో !"

అని వేగవేగ రా
మన పెద్దపెద్ద అం
గల పరుగుతో గుండె
కలతతో నెదురేగి

తలవాంచి వచ్చు సో
దరుని బిరబిర జేరి
యెడమ చెయి పట్టుకొని
అడిగె తత్తరపడుచు

"ఏమి లక్ష్మణ ! నీవు
ఇట్లేల వచ్చితివి ?
సీత నొంటరి దాని
జేసి యెటు వచ్చితివి?

నా కంతమని నమ్మి
నను గావ వచ్చితివ !
నాశక్తినే లక్ష్మ
ణా ! సంశయించితివ !

ఎంత పని చేసితివి
ఏ మందు లక్ష్మణా !
నీవు చేసిన పనికి
నేను హర్షింతునా ?

వచ్చునప్పుడు నీవు
వైదేహి బిలిచికొని
రావైతి వికసీత
రాక్షసుల పాలయ్యె !

తమ్ముడా ! ఇక మనకు
దక్కునా మనసీత
ఏ రాక్షసుని చేత
యే మయ్యెనో కదా !

నిను నమ్మి జానకిని
నీ రక్షణము నందు
వదలగా నీ వడవి
వదలితివి వంటరిగ"

అని నింద మోపు రా
ముని ములుకు పలుకులకు
సౌమిత్రి మనసెంతొ
సదమదమ్మై పోయె !

అటుచూడ వదినమ్మ
అనరాని మాటలనె !
ఇటుచూడ అన్నయ్య
కటువుగా మాట్లాడె

ఒక చెంప వదినమ్మ
ఒక చెంప అన్నయ్య
చరిచి నట్లని పించె
సౌమిత్రి కకటకట !

నిష్కామ సేవకుడు
నిష్ఠూరమై పోయె !
జగములో నిదియేల
యుగ ధర్మమైపోయె !

అకట ! సేవాధర్మ
మది యెంత దుస్తరము !
దాని పాటించు టె
వ్వానికిని దుర్భరము !

లక్ష్మణా ! నీసహన
లక్షణమె లక్షణము
నీదు సేవా ధర్మ
నిరతికేదీ సమము ?

పరుషోక్తు లెట్లెట్లొ
భరియించి లక్ష్మణుడు
నిగ్రహముతో బలికె
నగ్రజునితో నిట్లు—

"అట్లనకు మట్లనకు
మట్లనకు మన్నా!
మనవి చేసెదను నా
మాట వినుమన్నా!

అసురు మాయనెరింగి
అడుగు కదలని నన్ను
అనుమానమున వదిన
అనరాని మాటలనె.

అన్న అలుపది కాదు
అన్న కాపద రాదు
అని యెంత నీశక్తి
కొనియాడి చెప్పినను
వినిపించుకోదయ్యె వదిన!
విహ్వలిత యైనందు వలన!

పొమ్మ్మి పరువెత్తుమని
పోరెంత వెట్టినను
పదిన నొంటిగ వదలి
కదలకుండిన నన్ను

అంతంత మాటలనె
అనుమాన కలితయై
శంకించు వారలకు
వంకలే కనుపించు

నిజమెంత చేదైన
నిర్వచించుటె మంచి
దని చెప్పెదను గాని
వినరాని మాటలవి.

"ఎంత పొమ్మన్న నీ
వింత వినక నదేమొ
చెప్పెదవు నామాట
చెవిపెట్ట కున్నావు.

అన్న చచ్చిన యెడల
నన్ను పొందగ వచ్చు
నని యెంచి మా వెంట
చను దెంచితివి కాక –
అన్న దీనారవము
ఆలకించిన వెంట
నే పరుగుతో నురికి
కాపాడ కుందువే ?

మిత్రువలె నటియించు
శత్రుడవు దుష్టుడవు
వంచకుడ వీవు నీ
వంచనకు లోబడను –

భరతుతో నేదొ యొ
ప్పంద మేర్పరచుకొని
యున్నావు నీవు నీ
పన్నుగడ సాగదుర :

దుష్టుడా! యేటిలో
దూకి చచ్చెద గాని
నీకు లోబడుదునా
నీచుడా నీవె మా
నిజమైన శత్రుడవు
కుజనుడవు క్రూరుడవు
నిను నమ్మి చెడితిమిర కపటీ!
నీవెంత నీచుడవు చెనటీ!"

"అనిపోటు మాటలన
మనసంత మసికాగ
కనులెఱ్ఱబడె తనువు
కంపింపగా సాగె!

క్షణమాగ లేక తత్
క్షణమె వచ్చితినిట్లు
మాట పోటుల కేను
మదినొవ్వ వచ్చితిని_

కాని నాయంత నే
పూని యిటు రాలేదు"
అని లక్ష్మణుడు బలుక
అగ్రజుండిట్లనియె—

"తమ్ముడా! స్త్రీల త
త్వము నీవెరుంగవుర!
తరుణులకు చపల చి
త్తము సహజగుణమురా!
అంతమాత్ర మెరుంగ
వా! లక్ష్మణా! సీత
అట్లన్న నీవిట్లు
అరుదెంచగా దగున?
ఆగ్రహావేశమే కలదా?
ఆలోచనము సేయవలదా!

# పర్ణశాల

## విషాద యోగము

కటకటా! జానకిని
కారడవిలో వదలి
వచ్చితివి, కడగండ్ల
బడబాగ్ని ద్రోసితివి.

నగు మోముతో సీత
నాకెదురు రాదేని
నా ప్రాణములు నిలుచునా!
లక్ష్మణా!
నాకింక తెలవారునా!

కక్షతో రాక్షసులు
భక్షించిరో! లేక
ఎత్తుకొని పోయిరో!
ఎందున్నదో సీత!

నాకష్ట దశయందు
నను వీడకుండ నా
వెంట వచ్చిన సీత
కంటకము పాలయ్యె!

తమ్ముడా ! ఇక పదప
దమ్మనుచు రఘువరుడు
పరుగులిడి పంచవటి
కరుదెంచు వడివడిగ

కాళ్లు తడబడు చుండ
వళ్లు వడకుచు నుండ
గుండె దడదడ కొట్టు
కొనుచుండ దుశ్శకున
ములు దోపగా పుట్టి
మునిగి పోయె నటంచు,
ధాత్రీజ జూడ తహ
తహ పడుచు దూకులిడి
పదములను కరములను
విదలించు కొనుచు ను
క్కిరి బిక్కిరై ఎగిరి
కీరంబు వలె పర్ణ
శాల లోపల వాలినాడు !
జానకీ ! యని బిలచినాడు !

అటుచూచు ఇటుచూచు
ఎటుచూచినను గాని
ప్రియురాలు కనరాక
స్పృహ దప్పినట్లయ్యె !

ఆశ్రమములో నుండి
ఆత్రమున దూకులిడి
బయట కరుదెంచి తన
ప్రాణ సఖికై చూచు !

ఎటుచూచినను గాని
ఇల్లాలు గనరాదు
ఏడున్నదో కదా చెలియ !
ఏమయ్యెనో కదా సఖియ !

కనువిందు గొల్పు ప
చ్చని పంచవటి ఇప్పు
డది పాడుపడి నట్టి
పొదరిల్లుగా మారె !

(16)

కుముదమ్ము లేనట్టి
కొలనువలె సీతమ్మ
లేనట్టి పంచవటి
రేయివలె గన్పట్టె:

కన్నీటి కేరటాలు
కన్నుల పొఱ్ఱాడగా
జగమెల్ల రామయ్య
కగుపించె చీకటిగ:

రెక్క విరిగిన పక్షి
దిక్కుమాలిన రీతి
చెలిలేని బ్రతుకంత
చీకట్లు కమ్ముకొనె

సీత సీతా యనుచు
చెయ్యెత్తి పిలచె
సీత గానక గుండె
కోతగా కలంచె:

# విరహ జ్వాలి

"ఓసఖీ ! ఓ ప్రియా !
ఓ జానకీ ఎక్క
డున్నావు ? ఎటుదాగి
యున్నావు ? కనరావు !
సఖియ ! నీ సరసాలు
సైప లేనిక చాలు
నన్నేడి పించకే !
నాకు కనుపించవే !
అదిగదిగొ ! ఆపూల
పొదలోన దాగితివి !
నన్నేడిపించి నీ
నవ్వు లెగ బోసితివి !
ఓహో ! నితంబినీ !
ఒకసారి ఆగు ! నిను
కనుగొంటి నిక దాగు
కొనలేవు. నీ పసుపు
పట్టుచీరది నీవు
పరుగెత్తు చుండగా
నాకు కనుపించెలే చెలియ
నన్నేడి పించకే సఖియ !

ఇకచాలు చాలు నీ
పక పకలు జానకీ !
ఒకమారు కనుపించి
ఓదార్చవే నన్ను !

చెట్ల చాటున దాగి
చెలియ నాతోనేల
పరిహాస మాడెదవు
పలుకవే ఒకసారి

ఇంత పరిహాసమది
యే నాడు లేదుకద !
పరిహాసమున కైన
పరిమితము కలదుకద !

ఓ సుమధ్యా ! నీవు
ఒకసారి కనిపించు
నవ్వు లాటలుచాలు
నన్నోడిపించ కిక

అలసితిని సొలసితిని
ఆయాస పడి పోతి
నెటుపోయినావు న
న్నొడ బాసి ఓచెలీ !

నాకు తోడువు నీవు
నాకు నీడవు నీవు
నినువీడి బ్రతక గల
నే ! చెలీ ! నెచ్చెలీ !

చిన్నారి చినదాన
చెన్నార మరల నిను
కన్నార గనగలన !
కన్నీళ్లె మిగిలేన !

ఓ చెలీ ! ఓ ప్రియా !
ఓ నెచ్చెలీ కాన
రావే !" యటంచు రా
జీవాక్షు డెలుగెత్తి

పిలిచెరా బిగ్గరగ
ప్రియురాలి కోసమై
కారాటవీ హృదయ
మారాట మొందగా
ఏడున్నదో కదా చెలియ!
ఏమయ్యెనో కదా సఖియ!

చెట్టు చెట్టును తట్టి
గుట్ట గుట్టను ముట్టి
సీత యేదీ యనుచు
చీకాకుతో నడుగు

తరులతా గుల్మముల
పరువెత్తు నదములను
ఖగములను మృగములను
నగములను దిగులుతో

నా సీత గన్నార
నాకు దెల్పుడటంచు
మాటి మాటికి నడుగు
మారాడ దాకటైన!

ఏది నా సీత యని
ఎంతెంత ఏడ్చినా
కారాటవికి ఏల
కాసంత విసరాదా !

"అయ్యయ్యొ ! సీత ! యే
మై పోయినావు ని
న్నెడ బాసి జీవించు
టెట్లి నాకు వట్టిద"ని
విలపించి విలపించి
వివశుడై ఊబిలో
దిగబడ్డ యేన్గు వలె
పొగులు రాముని జూడ
గుండె చెరువై పోవురా !
శైలాల
నుండి ఝరులే పుట్టురా !

విధి వికట వీచికల
విధురాగ్ని చెలరేగ
జగమెల్ల జడసి మూ
గగ మారి పోయెనో !

లేక రావణు భయము
సోక తాళము పడెనా!
మారాడ దాకటైన కాని!
కారెడద కరుగ దింతేని!

సీత సీతా సీత
సీత సీతా యనుచు
చెట్లతో గుట్లతో
ఏర్లతో లేళ్ళతో
ఎదురేది యైనచో
ఏది నా సీత అను —!

ఇటు పోవు నటు పోవు
ఎటు సీత కనరాక
కనులలో గిరగిరా
కన్నీళ్లు నిండుకొన
ఏది నా సీత యని
ఎంత ఇదియై పోయె!
ఏడున్నదో కదా చెలియ!
ఏమయ్యెనో కదా సఖియ!

## ఉన్మాదస్థితి

ఏడ్చేడ్చి కనులుబ్బి
యెఱ్ఱబడ వెఱ్ఱివలె
పిచ్చిచూపులు వెట్టి
పెదవదర 'ఇక నాకు
దిక్కెవ్వ'రని వెక్కి
వెక్కి యేడ్చుచు శిరము
ముంజేతితో కొట్టుకొనును :
ముమ్మారు 'జానకీ!' యనును :

అన్య చింతాక్రాంతు
డై ప్రతిమ యైపోయె :
ప్రియురాలి నెడబాసి
పిచ్చివాడై పోయె :

ఉండుండి చెయ్యెత్తి
'ఓ సీత :' యని పిలచు
చిరుచీమ చిటుకన్న
చెలి వచ్చెనని తలచు

చిరుగాలి వీచినా
చిగురాకు కదిలినా
నలుదిక్కు లెగ దిగా
చెలి కోసమై చూచు !

తన నెవరొ పిలిచి న
ట్లనిపించి ఉలికిపడు
అదె సీత వచ్చెనని
అందెలిడి తొట్రుపడు !

తన నీడ గని సీత
చనుదెంచు నట్లగును
మనసులో నెవ్వరో
మాట్లాడి నట్లగును

తన ప్రక్కనున్న ల
క్ష్మణుడు కనపడకుండె
లోలాక్షి సీతనే
లోగనులు గనుచుండె !

రెప్పవాల్చక కన్ను
లప్పగించుచు నెదో
కనుచు చేతులు త్రిప్పు
కొనుచు లోలోపలను
ధరణి తనయను తలచుకొనును !
తనకు తా మాట్లాడుకొనును !

తన నీడగాంచి భూ
తనయగా భ్రమజెందు :
బ్రమకాదు కాదు స
త్యమె యెందు కనరాదు ?

ఉభయులకు నీడ లవి
ఒకటిగా నుండె నొకొ !
ఒకరితో నొకరు వీ
డక నెప్పుడుందు రొకొ :

ప్రియుల నీడల కెపుడు
భేదమే లేదంట
తనువు లవి వేరైన
మనము లొకటేనంట.

ద్వైత మెరుగని దివ్య
దంపతు లహో! వారి
కణువణువులో నున్న
దద్వైతమే నంట.-

చిత్తభ్రమ జెందినట్టి
శ్రీరాముఁడు దీనముగా
సీతెక్కడ దెలుప్పడనుచు
చెట్టుచెట్టు నడుగసాగె!

"ఓ కదంబమా! చెప్పవె!
నీకు తెలుసు సీత జాడ
ఆమెకు నీ పూలంటే
అమితమైన ప్రేమ కదా!

తిలక నగమ! నీపై నా
చెలికెంతో ప్రేమ కదా!
ఝుమ్మని తుమ్మెదలు నిన్ను
ఝుట్టి పాడ గన వచ్చెన?

తిలకనగమ = బొదుగు చెట్టు!
కదంబమా = కడిమి చెట్టు!

పరువెత్తుచు నీ పువ్వుల
కొరకెవ్వడు వచ్చుగదా !
కర్ణికారమా ! సీతను
కన్నావా ! నీవైనా !

సరళభూజమా ! కంటివె!
సరళ హృదయ నా సీతను
మల్లిక కన్నావ ! తనూ
వల్లిక నా ప్రియురాలిని.

తాళమా! నీ ఫలములవలె
స్తనములు గల జవరాలిని
నా సఖియను సీతను గ
న్నావా! నీవైన చెప్పు!

ఓ మద్దీ! నీ మాదిరి
ఊరువులను గల దానిని
నా చెలియను సీతను గ
న్నావా ! నాతో చెప్పవె !

---

కర్ణికారమా = కొండగోగు (జేలు) చెట్టా !
సరళభూజమా ! = తెల్లతెగడ చెట్టా !

నేరెడ ! నీ పండ్లవోలె
నిగనిగమని మెరిసెడు నును
పైన దేహమునుగల నా
ప్రాణ సఖిని గన్నావా !

ఓ అశోక వృక్షమ ! శో
కోప హతాత్ముని నను నీ
పేరున బరగంగను నా
ప్రియురాలిని జూపించవె !

ఓ బాల రసాల ద్రుమా !
ఒక సారిటు పల్కుమ ! నీ
చిగురు వంటి యఱచేతుల
చిన దానిని గన్నావా !

ఓ అర్జున తరురాజమ !
ఉత్త పిరికి పిల్ల సీత
ఎందేగెనొ నీ పైనా
ఎరుగుదేమొ చెప్పమ్మా !

---

అర్జున తరువు = తెల్లగన్నేరు చెట్టు
బాలరసాలద్రుమా = లేత మామిడిచెట్టా !

నీపమ ! నాపయిని కరుణ
జూపుమ ! నీ పూలవంటి
పెదవులు గల దానిని నా
ప్రియురాలిని గన్నావా ?

పనసా ! చప్పున చెప్పవె !
పసుపు పట్టు చీర కట్టు
కొన్న యట్టి నా సీతను
కన్నావా నీవైనా !

చిగురు వంటి దేహముగల
చిన్నది మిసమిసలాడే
జవ్వని సీతను గంటివె
సాలవృక్షమా చెప్పవె !

బింబవృక్షమా కంటివె!
బింబాధర నాసఖియను
బిల్వ వృక్షమా కంటివె !
బిల్వస్తని నా చెలియను.

---

నీపమ = మంకెన చెట్టా !
బింబ వృక్షము = దొండ చెట్టు

మొగిలీ ! ఓ మొగిలీ ! నా
మగువ సీత జాడదెల్పి
నాదుఃఖము బాయుగ పు
ణ్యము గట్టు కొనంగ రాదె !

కమలిని ! నీవలెనే కమ
లములు దాలిచిన సీతను
కన్నావా ! నీవైనా
కనికరించి చెప్పమ్మా !

నవవయస్థ ! చూచితివే !
నవవయస్థ నా సఖియను
జంభధృమ ! కన్నావా !
జంభస్తని నాచెలియను.

నళినీ నిను బోలినట్టి
నళినీ ముఖి నాసీతను
కన్నావా ! నీవైనా
కనికరించి చెప్పగదవె !

---

నవవయస్థ = ఉసిరిక చెట్టా
జంభధృమ = నిమ్మచెట్టా !

అని రాముడు సీత కొరకు
కనిపించిన చెట్లనెల్ల
సీతెక్కడ చెప్పుడనుచు
చిత్తభ్రమగొని యడుగుచు
తిరిగి తిరిగి చూచుచు ధా
త్రీజ గానలేకేడ్చుచు
పిచ్చిపట్టినట్టి వాని
విధ మిదియై పోయెనకట !

ఎంత అడిగిన కాని
సుంతైన బదులాడ
కుంటచే వేడి ని
ట్టూర్పు సెగ లెగజిమ్మ

రాముడేడ్వగ నిచటి
భూమిలో లోహాది
ఖనిజములు బొగ్గులును
జనియించునే కాని
పుష్పఫల వృక్షములు
పొసగ పెంపొందవట !

తరులతా గుల్మములు
మరుమాట లాడవని
జంతు మృగముల నడుగు
జానకిని జూపు డని

“హరిణీ నీకనులవంటి
అందమైన కన్నులు గల
నారిని నా సీతను గ
న్నావా ! నాతో చెప్పవె !

కరణీ ! నీ కరము వంటి
కడు మనోజ్ఞమైన ఊరు
వులుగల జవరాలిని నా
చెలిని గంటివే చెప్పవె !

మదగజమా ! నీవలెనే
మంద మందముగ నడిచెడు
గజగామిని నాసీతను
గన్నావా ! చెప్పగదవె !

చిలుకా ! ఓ చిలుకా ! నీ
పలుకులవలె ముద్దులొలుకు
పలుకులుగల నాసీతను
తిలకించితివే చెప్పవె :

కలకంఠమ నీవలెనే
కమ్మని కంఠము గల్గిన
దానిని నాసీతను నీ
వైన గంటివే చెప్పవె :

శార్దూలమ : జంకకు నా
సఖిని మ్రింగినావని ని
న్ననుట లేదు చెప్పుమా
కనుగొంటివె నాసీతను”

అనిఇట్లు సీతకై
వనమెల్ల వెదకుచును
ఎదురేది కనుపించ
‘ఏది నాసీత’ అను

జడములనకను వాటి
నడుగు దైన్యము తోడ
మతి దప్పినట్టి ఉ
న్మదుని వలె గన్పట్టె !

మది మెదలు చున్నట్టి
మైథిలిని కన్నులకు
కట్టుకున్నట్లు గ
న్పట్టె రాముని కకట !

మది లోననే కాదు
ఎదు రేది కనుపించ
దానిలో సీత సౌం
దర్య మేదో కాంచు

కరినిగని మనసులో
కరిగమన నూహించు
హరిని గని యెడదలో
హరి మధ్య భావించు

మృగ సమూహము గాంచి
మృగ నయన గలదంచు
ఆత్రమున నా మంద
నందందు పరికించు

బింబమును గని మదిని
బింబోష్ఠి దలచు కొను
జంభమును గని మదిని
జంభకుచ దలచు కొను

"జంబు సుస్నిగ్ధ నా
జానకిని గంటివా?
*జంబువూ! చెప్పవె ని
జంబు దాచక" యనును —

ఎంత భ్రమరా! రాము
డంత వాడిట్లాయె!
ప్రియురాలి నెడబాసి
పిచ్చివాడై పోయె!

* జంబువూ = నేరేడు చెట్టూ!

"పవనమా! సీత యే
ప్రాంతమున నున్నదో
ఆ దెసకు పయనించి
ఆమె తనువు స్పృశించి
నా మేను స్పృశియించుమా !
దయబూని
నాశోకమును దీర్చుమా !"

అని గుండె పిండినటు
ఎనలేని దుఃఖమున
అద్రులే క్రుంగునటు
అంబుధులు పొంగునటు
అకట ! కన్నుల నిండ
అశ్రుజలములు నిండ
సీతకై శ్రీరాము డేడ్చు !
ఆ తండ్రి గోడెవ్వ డార్చు !

"ఓ జగత్ చక్షువూ !
ఓ కర్మసాక్షి ! ది
వాకరా ! చెప్పు నీ
పైన జానకి జాడ !

నీకు తెలియని దుండు
నే విశ్వమందు ? నీ
కనుగప్పి సీత నే
దనుజు డెత్తుక పోవు ?

ఇనకులుఁడ ! మనుకులుఁడ !
ఇక్ష్వాకు డను వాఁడ !
నీ వంశజుఁడనయ్య నేను
నీ పైన తోడ్పడవ భాను ."

అని యెంత బతిమాలి
ననుగాని భాస్కరుడు
బదులు పల్కడు తాను
బంధువే కానట్లు !

సాన బట్టిన యట్టి
చరిత చూడగ నితడు
పాషాణుడే యనుట
పరమ సత్యంబగును

సంజ్ఞకై ఇతని తే
జము తరుగ జేయుటకు
సాన బట్టె నటంద్రు
గాని సంగతి వేరు _

తన కూతు సంజ్ఞతో
దయమాలి యుండుటను
కరకుదన మొక్కింత
తరగించుటకు వీని
సాన బట్టెను కాని
సహజత్వమది హెచ్చె !
ఇది యెరుగ డా విశ్వకర్మ !
యెద సాన బట్టగా వశమ ?
బతిమి లాడిన కాని
బదులు వల్కని వాని
యెడద పాషాణమ్ము కాద !
జడముతో సరిపోల్చ రాద ?

# ఆర్తి

నల్ల కలువల వంటి
నయనాల జలజలా
కన్నీళ్లు గ్రమ్ముకొన
గద్గద స్వరముతో
'సీత సీతా!' యనుచు
శ్రీరాము డార్తితో
గొంతెత్తి పిలువగా
కొండలే ద్రవియించె!

అందుకే నిర్ఝరులు
అద్రు లందున బుట్టె.
ఆనాటి కీనాటి
కాగుట్టు కన్పట్టు.

కరుణార్ద్రితలు పొంగ
కన్నీ రొగార్చనో!
మాటి మాటికి బిలువ
మారాడ బలుకనో!

గుండె లేనటు వంటి
కొండ బండలు గూడ
గలగలా జలజలా
కన్నీరు స్రవియించు !
ధ్వనికి మారుగ ప్రతి
ధ్వని నెదో వినిపించు !

'స్పందించు పోర ! ఆ
క్రందనకు శిఖరాలు !
ద్రవియించు లేర ! మా
నవతకై హృదయాలు !'

అని చెప్పు గోదారి
కద్దరిని గల శిఖరి !
ఆలించి నా గుండె
ఆయె కవితాలహరి !

భద్రాద్రి సీమలో
పర్ణాశాల గ్రామ
మున వెలసి నట్టి స్వా
మిని "శోక రాము' డని
జనులు బిలచెద రశ్రు
జలము కన్నుల గ్రమ్మ !

'ఇట రావణుడు సీత
నెత్తుకొనిపోయె' నని
'ఇలతనయ నెడబాసి
ఇట రాము డేడ్చె'నని
'ఇదె పర్ణశాల' యని
ఎద నొచ్చు నట్లుగా
రథనగము జానకీ
రామ కథ నాతోడ
చెప్పగా నా గుండె
చెరువయ్యె పోర!
అది సత్యమని నేటి
కగుపించె లేర!

అందుకే గోదారి
కపుడపుడు వరదలిట!
అందుకే భూదేవి
కపుడెపుడొ కంపమిట!

ఇది జనశ్రుతి దీని
కెదురాడు వారెవరు?
రథనగము చెప్పు ఈ
కథ వినని వారెవరు?

ఇది గేయ కవిత నా
ఎదపొంగి సాగినది
యుగయుగాల చరిత్ర
జగతి మార్మ్రోగినది.

## పవిత్ర బంధం

కాంత తన కౌక్కింత
కాన రానంతనే
కన్నీరు మున్నీరు
గా నేడ్తురా యేమి ?

మోహమా! స్త్రీకామ
దాహమా! కాదు కా
దది కాదు కాదు యే
పద జాలమున కంద
నిది దివ్య దాంపత్య
మది పవిత్రమైన
బంధంబు, విడని సం
బంధంబు. అది తెగిన
బ్రతుకంత పాడవునురా :
జంటకై
ప్రతిజీవి తపియించురా!

తన కష్టముల పంచు
కొన వెంట వచ్చినది.
తన సేవకై వచ్చి
దవములో దూకినది.

భర్త యనగా సతిని
భరియించు వాడయ్యె!
భార్యనే బడబాగ్ని
బడ ద్రోసి నట్లయ్యె!

పరమ కరుణామయుడు
శరణాగతుడు రాము
డాలి నబలను సీత
నాదుకొన లేడయ్యె!

తనయందు రక్షింప
దగు భారముండగా
తన్నాశ్రయించినది
దారయై యుండగా
విలవిలా విలపించడా!
రాఘవుడు
విరహాగ్ని తపియించడా!
సీతకయి

## గోదావరిలో సోదా

గోదావరికే వెళ్ళెనా !
లేదు లేదు వెళ్ళలేదు
నేను వెంట లేకుండగ
తా నొంటరిగా వెళ్ళదు

పద్మాలను కోసి కొనగ
పద్మసరో వరమేగెనా !
కాదు కాదు తానొంటరి
గా వెళ్ళదు నేను లేక

అడవి అందమును జూడగ
అరగెనేమొ ! అబ్బెబ్బె !
పిరికిది తా నొంటరిగా
నరుగ దెటకు నేను లేక

నన్ను నిన్ను భయపెట్టగ
నవ్వులాటకని యేమో !
ఈ యడవిని యెక్కడైన
ఇలసుత దాగెనా యేమో !

అదిగో గోదావరి తా
నచట తరచు నేగుచుండు
ముచ్చటపడి నేడుకూడ
నచ్చటికే యరగి యుండు.

మీ వదినకు గోదావరి
మీద మిగుల ప్రేమ కదా
అనుజా! నీవటకు నేగి
అరయు మచట నున్నదేమొ!"

అని రాముడు పలికిన తత్
క్షణ మనుజుండు టికి నాడు
గోదావరి రేవు రేవు
సోదా గావించినాడు

"వదినా! వదినా! యటంచు
వాయినొవ్వ బిలచినాడు
'అమ్మా! సీతమ్మా! అని
అరచి యరచి యలసినాడు

ఎటుచూచిన కనపడ వీ
వెక్కడ వదినమ్మా! నా
నోరు నొవ్వ బిలచిన నొక
మారైనా బలుకవమ్మ!

అమ్మా! సీతమ్మా! న
న్ననుమానించకు మమ్మా!
కనుపించుము తల్లీ! నను
గన్నతల్లి వీవమ్మా!"

ఎంత గొంతు జించుకొన్న
ఏమయ్యెనొ బదులాడదు!
ఎందెందున శోధించిన
ఎటు బోయెనొ కానరాదు!

తిరిగి వచ్చి రామానుజు
డెరిగించెను రామునితో
కలతపడిన డెందముతో
కడలెత్తిన కన్నులతో!!

"ఏ రేవున లేదు వదిన
ఎందేగెనో ! ఏమో ! నే
నెంత బిలచినను బదులు ర
వంత లేదు ఏమయ్యెనో!"

ఆ మాటల కేమి తోచ
కరిగెను స్వయముగ రాముడు:
"అమ్మా ! గోదావరి ! చె
ప్పమ్మా ! సీతెక్కడ" అని
దీనముగా నడిగె కాని
మౌనమూనె గోదావరి !

మొక్కు దేవరకు వెఱతున ?
మొట్టు దేవరకు వెఱతున?
అని రావణునకు భయపడి
అట్లా మౌనము దాల్చెనో !

## లీలాస్మృతి

అంత నిరాశా హతుడై
అశ్రుజలంబులు కన్నుల
ముసురు కొనగగుండెలోన
మూగ బాధ రేగు కొనగ

గౌతమీ తటాన నిలచి
కన్నార్పక చూచునెదో !
మధుర స్మృతు లేవేవో
మది లోపల మెదలెనహో !

అదిగో సీతాసతితో
నదీజల క్రీడలతో
అలసి సొలసి ఒడ్డుజేరు
నపుడు జరిగినట్టి వింత—

అదిజల క్రీడా వి
హార దృశ్యము నాటి
క్రీడా విలాసంబు
లీలగా కనుపించె

జలకేళిలో యలసి
సొలసి పోయిన జంట
దరిజేరగా జూచు
తరుణంబులో సీత

బిర బిరా ముందు తా
దరి కెక్కి యలసి పో
యిన రామమూర్తి నిం
కింత శ్రమ పడుపగా

కాంతుడే రాయిపై
కాలు బెట్టగ బోవ
నారాయి కనుపడని
యట్లు గమ్మతు సేయం

ముఖము మీదను జల్లు
పోరాడగా తప్పు
టడుగు పడ రామయ్య
పడి పోయె నంతలో—

పక పకమ్మని విరగ
బడి నవ్వు వైదేహి
విరబూయు మల్లికా
తరువల్లి యై పోయె

"ఏనుమగువను మీర
లేకైక వీరులు గ
దా! మిమ్ముగెలిచి" తని
తాజెప్పి చెప్పినగు

అదిజల క్రీడరా!
మదిని చిత్రించెరా!
తలచుకొని తలచుకొని
దాశరథి యేడ్చెరా!

నది గట్టుపై నిలచి
నయనాలు చెమ్మగిల
మధుర మధుర స్మృతులు
మది మెదల సొమ్మగిల

గుండె చెరువై కన్ను
గ్రుడ్లలో నిండుకొని
ఎంతగా అడ్డయిన
ఎడద కన్నుల తోడ

కన్నార్పకేదియో
కాంచు రాఘవులు
కన్నీటి కెరటాల
కదలాడు స్మృతులు

జల్లు గొట్ట తప్పడుగుల
జారిపడ్డ మగని గాంచి
పకపక మని నగవులొలుకు
వికసించిన పువ్వు వంటి
సీతా సందర్శనమున
చేతము చెరువై పోగా
శ్రీరఘువరు డార్తి జెంది
సీతను గను తహతహతో -
"అహా ! నా కిపుడు గనుక
అవనీసుత కనుపించిన
ఈ రమణీ యాటవిలో
ఇచటి జనస్థానములో
ఈ గౌతమి గట్టునందు
ఈ ప్రస్రవణాద్రి యందు
సీత చేయి నాచేతను
జేర్చి పట్టుకొని హాయిగ
విహరింతుము గదా యనుచు
విధి యెంతగ జేసె ననుచు

వగ జెందుచు వాపోవుచు
వఫ దేవత లంగలార్చ-
'ఏదీ నాసీత యనుచు
ఎదలు బాదుకొను చేడ్చుచు
'సీతాసీతా' యటంచు
చేతులెత్తి బిలచిన ఆ
రామ విలాపానికి నా
రాతిగుండె పగిలి పోయి
నాకడ పడి యున్నది ఈ
నాటికి దానిని గను"డని
గోదావరి కుడి ఒడ్డున
గుట్ట ఒకటి చెపుతున్నది.
భద్రాచల సీమలోన
పర్ణశాల ఒకటున్నది.

## నిరాశా నిస్పృహలు

విధి వలయమున జిక్కి
విదలించు కొనలేక
యెడబాటులో రేగు
బడ బాగ్ని బడలేక

ఎడఁదలో కడలెత్తు
జడధి నీదగ లేక
సుడి వడుచు నిట్టూర్పు
లిడుచు కన్నీరొలక

రాముడే దేవుడై
రణరంగ బీముడై
ఆలి నెడబాసి దై
న్యావస్థలో నలిగి
విలవిలా విలపించెరా !
సీతకై
విరహాగ్ని తపియించెరా !

శోకాతి శయములో
క్షోభించి క్షోభించి
విరహ దావాగ్నిలో
విలపించి విలపించి

దైర్యమును వీడి ని
ర్వీర్యుడై వివశుడై
దైన్యమ్ముతో గద్గ
ద స్వరముతో వెక్కి
వెక్కి యేడ్చుచు సొక్కి
సొక్కి పోవుచు చేష్ట
లుడిగి చతికిల నేల
బడిపోయి జానకీ
పతి లక్ష్మణుని తోడ
పలికె జాలిని గొలుప,
"సీత నెడబాసి నే
జీవచ్ఛవము నైతి
తమ్ముడా! నీవయో
ధ్యకు పొమ్ము నే రాను.

జానకిని నావెంట
గానకను స్పృహ దప్పి
పడిపోవు మిథిలాధి
పతి గుండియలు పగిలి

‘సీత యేదీ ?’ యనుచు
నా తల్లి ప్రశ్నించ
మారాడగా నాకు
నోరాడునా చెప్ప ?

సీత లేకుండ నే
జీవించగా లేను
జానకిని వీడి స్వ
ర్గాని కైనను పోను.

తమ్ముడూ ! నీ వయో
ధ్యకు పొమ్ము ! నే నిక్క
డే యడవిలో చచ్చి
పోయెదను నేరాను

అరణి కట్టెల నుండి
అగ్ని చెలరేగి నటు
నా లోని శోకాగ్ని
నను కాల్చుచున్న దిటు.

తమ్ముడా ! నే నెంత
దౌర్భాగ్యుడనొ ! పూర్వ
భవములో నెన్నెన్ని
పాపములు చేసితినొ !

రాజ్యమును గోల్పోతి
రమణి నెడ బాసితిని
జన్మ భూమిని బంధు
జనములను వీడితిని”

అని దుఃఖము పొంగ
అంగలార్చుచు బలుకు
రామచంద్రుని తోడ
లక్ష్మణుండిట్లనియె !

# పర్ణశాల

## తమ్ముని ధైర్యోక్తి

"అగ్రజా! నీవు ధై
ర్యము పూని లేలెమ్ము!
సీతకై వెదకుదము
నా తోడ రారమ్ము!
ఇచటెచట నో యుండు
నెందేగు భూతనయ?
ఈ గుహల ఈ గిరుల
ఈ వనాంతర మెల్ల
వెదకుదము వెదకుదము
వెత జెంద్గగా వలదు
సీత దొరకక పోదు నమ్ము!
చింతించ వలదు లేలెమ్ము!
గాలి తాకిడి కద్రి
కదలునా! నీవంటి
వీరుడాపదక్రకం
పితుడగున? లే లెమ్ము"
అని ధైర్య మిచ్చె లక్ష్మణుడు
తన తోడు నీడ సోదరుడు

"ఉత్సాహమున కన్న
ఉర్వి బలమే లేదు
ఉత్సాహ వంతునకు
ఓట మెన్నడు లేదు
ఉత్సాహమున లెమ్ము లెమ్ము !
ఉర్వితనయను వెదక రమ్ము !"
అని ధైర్యమును జెప్పి
అగ్రజునిలో రేగు
వేద నాగ్నుల మీద
నోదార్పు గురియించి
నిస్పృహ నిరాశాది
నిశ లెల్ల దొలగించి
ఆత్మ విశ్వాసమును
ఆశాలతను పెంచి
జడములో చైతన్య
జవము రేకెత్తించి
శోకాతిశయము లో
సొక్కి సోలుచు క్రుంగు
సోదరుని నోదార్చు చుండు!
శుభ లక్షణుడు లక్ష్మణుండు !

జానకీ వల్లభుని
సంతాప మొక్కింత
శమియింప నోదార్పు
చలువలను చిలకించి
లెమ్మనుచు సోదరుని
సొమ్మలో నుండి మే
ల్కొలిపె లక్ష్మణుడెంత ఘనుడు !
తెలిపె కర్తవ్యమును బుధుడు !

## సీతాన్వేషణ

అపుడన్న దమ్ములా
యడవి యంతయు సీత
కై వెదకు చుండగా
అగుపించె నొక వింత

మృగములు లేవో కొన్ని
ఎగబడుచు చూచినవి
రఘు వరునితో చెప్ప
రాక వగ జెందినవి.

ఆ మృగాలను చూచి
అవనీజ ఎక్కడని
అడిగె రఘుపతి కనుల
నశ్రువులు నింపు కొని.

అడిగినంతనె మృగము
లవి గబాలున లేచి
తగ నింగి కెగజూచి
దక్షిణము దిశవైపు
పరుగు లిడుచును రామ
భద్రు వైపును జూచె.
ముచ్చులను బట్టించు
మూగ జంతువులు!
తుచ్ఛులకు దోడ్పాద్రు
ధూర్త మానవులు
మూక బాషను తెలియవలెను
మోస కారుల బట్టవలెను.

వాటి ఇంగిత మెరిగి
వాక్రుచ్చె లక్ష్మణుడు :
"అన్న ! సీతెక్కడని
అడిగినంతనె లేళ్లు
దక్షిణముదిశ చూచు
లక్షణము చూడగా
మనము దక్షిణ దిశగ
చన వలయునని తోచు
వదినె దొరుకగ వచ్చు
వెదకుదము నటువైపు."
అని లక్ష్మణుడు పలుక
అన్నదమ్ములు దక్షి
ణము దెక్కు కొంత దూ
రము వెళ్లినంతనే —
నేలపై పడియున్న
పూలు జూచి ఉలుక్కు
మని "లక్ష్మణా చూడు"
మని రాము డిట్లనును

"ఈ పూలు మీ వదినె
వే చూడు తమ్ముడూ!
ఇవి నేవె తెచ్చియు
నింపార ముడుచుకొనె"

అని దుఃఖ ముప్పొంగ
కనులు చెమ్మగిలంగ
ఆ పురుష పుంగవుడు
ఆర్తుడై ఆశతో —

ప్రక్కనే ఉన్న ప్ర
స్రవణగిరి వంక గని
"ఓ శైలరాజ! నీ
యునికి పట్టున నిచట
చూచితివ సర్వాంగ
సుందరిని నా సఖిని ?"

అన్నమాటకు బదులు
అన్నట్లుగా బలుకు.
శోక తప్తు డనంగ
లోకువా జడమునకు ?

విధిభంజనుని జూచి
వెక్కిరించగ రాదు.
పీడితుడు లోకైక
భీకరుడు అనరాదు.

తనదు ప్రశ్నకు సమా
ధానమ్ము తగినట్లు
రాకుండుటను జూచి
రాము డుగ్రుండగుచు

అల్ప మృగమును సింహ
మలసుతో చూచినటు
కను లెఱ్ఱజేసి రా
ఘవు డద్రితో పలికె —

"సీత యెట నున్నదో
చెప్పకుండిన యెడల
ఓ గిరీ! నిన్ను నీ
యునికి, నీ మూలమును
నా శరాగ్నుల చేత
నాశనము గావింతు"

అని యిట్లు కోపమున
అనలుడై అందె లిడ
అచట పదచిహ్నములు
అగుపించె రామునకు

భయముతో పరువెత్తు
పడతి చిరుపాదములు.
వెంటాడు రాక్షసుని
పెను వెడద పాదములు.

విరిగి పడిన ధనుస్సు
విరిగి పడిన రథమ్ము
ఇచటచట బడియుండ
ఇనకులుడు తొట్రుపడి,

"తమ్ముడూ! ఇటుచూడు!
ధాత్రీజ పాదములు.
మీ వదినె ధరియించు
మేని సొమ్ములు చూడు!

ఇది ఏమి లక్ష్మణా !
ఇటు చూడు నాయనా !
దనుజు లిరువురు కొట్టు
కొని రిచట సీతకయి.

ఇవి వింటి తుంట లిటు
తేల బడి యున్నవాకొ !
ఈ నెత్రు బొట్లిచ్చ
టేల బడి యుండెనాకొ !

లక్ష్మణా ! సీతనే
రాక్షసులు చంపిరో !
ఏడున్నదో సీత
ఎటుసైతు నెదకోత !

ఉన్నదా జీవించి
యుర్వి లోపల సీత
ఎట్లున్నదో సీత ?
ఇటుఃజేసె విధివ్రాత !

## రాముని కోపం

రక్షించు నంద్రు ధ
ర్మము విపద సమయాన
లక్ష్మణా ! చెప్పా ధ
ర్మము ఎక్కడుందిరా ?

ధర్మ గుణ శీల సీ
తను విపత్సమయాన
ధర్మమది కావకను
దయమాలి యెటుబోయె ?

ఎంత శూరుడు కాని
ఇల దయా పరుడైన
వాని నవమా నింత్రు
దీను డనుచు జగాన

జింక నొకదాని తొడ
జేర్చి కొన్నంతనె మృ
గాంకుడన్న కళంక
మా శశాంకున కొదవె

జింక గుంపుల జంపు
సింహ మది మృగరాజు
బిరుదుతో పిలువబడె
పీడకుడె కొలువబడె
దయ జూపుచో దీను డనిరి
దండించుచో ధీరు డనిరి

నే మెత్తగా నుంట
నిర్వీర్యుడని యెంచి
నే దయామతి నౌట
చే దీనుడని తలచి

నను లెక్క సేయకను
నా సఖిని రక్షింప
రైరి దేవత లింక
వారి పని బట్టెదను

నెలవంక వెన్నెలల
నిహతమ్ము గావించు
రవి వోలె నా పరా
క్రమము జూపెద గాక !

కరుణాది గుణములను
హరియించి సకల భూ
తముల రాక్షసుల వి
ధ్వంసమ్ము జేసెదను

యక్ష రాక్షస దాన
వాదులను తరు లతా
గుల్మముల శైలముల
గూల్చెదను కాల్చెదను

సౌమిత్రి చూడు నా
సాహసము నిప్పుడే
పంచభూతములను చ
లించ కుండగ జేతు

ముసలి తనమును మృత్యు
వును కాలమును విధిని
అఖిల భూతము లేవి
అడ్డు కొన లేనట్లు

నన్నడ్డ లేరెవరు
నాకమున లోకమున-
అనుచు చెక్కిళ్లదర
ఆగ్రహావేశమున
వేడి నిట్టూర్పులను
విడుచుచును ఎక్కుపె
ట్టిన ధనువు చూచుచును,
కనుల నిప్పులు రాల
మాటి మాటికి వింటి
త్రాటి మ్రోగించుచును,

ఉగ్రమున తనువెల్ల
ఊగి పోవుచు నుండ
ప్రళయ రుద్రుని వోలె
బాణమును సంధించి
కాలాగ్ని వలె జగము
కాల్చివేయగ జూచు
రామచంద్రుని జూచి
లక్ష్మణుడు తొట్రుపడి
అగ్రజుని శాంతింప
నిగ్రహించుచు బలికె-

## లక్ష్మణుని ఓదార్పు

"శాంతింపు శాంతింపు
శాంతింపు శ్రీ రామ !
శాంతింపు శాంతింపు
సకల సద్గుణ ధామ !

సహజముగ నీ వెంతొ
సౌమ్య స్వభావుడవు
కోపరహితుడవు స
ద్గుణ జలధి సోముడవు

నీ కోప దావాగ్ని
లోకాల హరియించు
నీ శరాహుతి జలధి
నే శుష్క మొనరించు

రామ ! లోకైక సం
క్షేమమే నీ మతము.
లో కోపకారమే
నీ కెంతొ సమ్మతము.

రామ ! నీ నైజగుణ
రత్నముల విడనాడి
తామసమ్మును దాల్చ
ధర్మమగునా నీకు?

అద్రిలో నౌన్నత్య
మంబుధిని గాంభీర్య
మర్కు నందున తేజ
మమృతాంశులో చలువ

పవన మందున గమన
మవని యందున నోర్మి
ఒకొక్కదాని యం
దొక్కొక్కటే గుణము
కలదు కానిటు వంటి
కల్యాణ గుణములవి
యన్నియును నీ లోన
యున్నవి గదా రామ !

నీ వెంతో మృదుల స్వ
భావుడవు రామా !
లోకాల బాధింప
నీకు సమ్మతమా !

కోపరహితుడవు స
ద్గుణ జలధి సోమా !
లోకైక నాశనము
నీకు సమ్మతమా !

శాంతింపు శాంతింపు
శాంతింపు రామ ! నీ
కోపాగ్నిచె జగత్
క్షోభ గావించకుమ !
సకల సుద్గుణ ధామ రామ !
సర్వజన సంక్షేమ కామ !

అపరాధ మెవడో చే
యగ లోక మంతయును
వధ్యమని తలచు టది
భావ్యమగునా ? రామ !

ఒకని నేరము కొరకు
ఉర్విలో నిరపరా
ధుల నందఱిని జంప
దలతువా ధర్మజ్ఞ !

ఇంతకీ ముక్కలై
ఇందందు బడియున్న
ఆయుధాలను రథము
నరయు నెవ్వని వాకో !

ఇది చూడ ఒక్కడే
రథి కుడనిపించు రెం
డవ యోధు డెవ్వడో
అవగతము కాదయ్యె !

కారణము లేక సం
ఘటిల దే యనుభవము
మన దుఃఖమునకు కా
రణము కర్మము నిజము.

పూర్వకర్మ ఫలమ్మ
బో_క్తవ్యమది తప్ప
దని నీ వెఱుంగవే
అర్క వంశో_త్తమా !

ఒకనికై నీ విట్లు
సకల లోకాల వి
ధ్వంస మొనరింతు నన
ధర్మమగునా రామ !

శత్రు వెవడో తెలిసి
చంపగా వలె వాని
ఫలమేమి లోకాల
భస్మమ్మ గావించ

కర్మ మనుభవమొందు
ధర్మమని బుధు లంద్రు
సుఖదుఃఖములు చలిం
చునె ధీరుడగు వాని?
నీకు తెలియని ధర్మ మేది ?
నిర్మల ప్రణయ పాదోధి !

వ్యర్థ కోపము వలన
వ్యర్థ శోకము వలన
నెర వేర దేకార్య
మెఱుగవే అగ్రజా !

నీలోని జ్ఞాన మది
నివురు గప్పిన నిప్పు
వలె నిదురనుండ మే
ల్కొలిపి నాడను గాని
నీ వెఱుంగని ధర్మ మేది ?
నిర్మల ప్రణయ పాథోధి ?

ధీమంతు డైనట్టి
సౌమిత్రి మాటలకు
కోపమింత శమింప
కోదండ మూతగొని
నిలచి రాఘవుడిట్లు
పలికె తమ్ముని తోడ

"నాయనా ! ఇపుడేమి
సేయుదము చెప్పరా !
ఇం కెచటి కేగుదము
ఈ వెవచియింపరా "
అంత లక్ష్మణు డిట్టు
లనియె రాముని తోడ_

"ఈ జన స్థానమం
దే వెదుకుదము రామ !
వసి యింతురిచటె రా
క్షసులు పెక్కురు గాన.

ఇచటెచటొ పొదలందు
ఇచటెచటొ. గుహలందు
దాచి యుంతురు ధరా
తనయ నాదానవులు

నీ వంటి ధీమంతు
లే విపత్సమయాన
ఏ తుపానుకును చలి
యించ రద్రి నిధాన.

చేత విల్లు ధరించి
నీ తోడ నే రాగ
వనమెల్ల ఓర్పుతో
వదినకై వెదుకుదము

కొండలో కోనలో
కొలనులో గుహలలో
నదులలో పొదలలో
సదనాలలో దేవ
గంధర్వ యక్ష రా
క్షసు లుండు స్థలములో
వెదకుదము వెదకుదము రామ !
వదినె దొరుకును సుగుణధామ !
అని లక్ష్మణుడు ప్రోత్సహించె
అంత రాఘవు డుత్సహించె !

# పద్దెనిమిది

## జటాయువు దర్శనము

ఇట్లు వెదుకుచు బోగ
ఈక్షించి రొక చోట
కొండవలె పడియున్న
అండజాగ్రణి నొకని.

నెత్తుమడుగున తడిసి
మత్తుగా పడియున్న
అసఘు పక్షీంద్రుని జ
టాయువును వీక్షించి

"గ్రద్ద రూపాన రా
క్షసుడు వీడే సీతఁ
మ్రింగి హాయిగ నేల
మీద బడియున్నాడు.

వీని నిపుడే వాడి
బాణములతో జంపి
కసి తీర్చుకొందు ల
క్ష్మణ చూడు" మని పలికి,

బాణమును సంధించి
పక్షీంద్రుపై కురికి
ఉగ్రమున నేలపై
నొక తాపు తన్నగా
తాపునకు వడకె భూ
తలమెల్ల గజగజా !

తనమీద కురికి వ
చ్చిన రామమూర్తి గని
జొల్లు నెత్తురు గ్రక్కు
చును మరణ బాధచే
సొమ్మలో యెట్లెట్లొ
చొరవ చేసుక హీన
రవముతో పక్షి రా
ఘవునితో నిట్లనియె !

"ఓయి ఆయుష్మంతు
డా ! ఔషధము కొఱకు
అడవి యంతయు వెదకు
నట్లు వెదకుచునున్న

నీ పత్నితో పాటు
నా ప్రాణములు గూడ
అప హరించెను రావ
ణాసురుడు నాయనా !

సీత నెత్తుక పోవు
చెనటి నెదురించితిని
వాని రథ సారథిని
వధియించితిని అదిగో !

వాని కవచ రథాలు
ధ్వంస మొనరించితిని
పరికించి చూడు మవి
పడియున్న విచ్చోట !

అడను గని వాడు నే
యలసి పోయిన వేళ
పోరులో నా పక్ష
ములు రెండు తెగవేసె.

బాణమును సంధించి
పక్షీంద్రుపై కురికి
ఉగ్రమున నేలపై
నొక తాపు తన్నగా
తాపునకు వడకె భూ
తలమెల్ల గజగజా !

తనమీద కురికి వ
చ్చిన రామమూర్తి గని
జొల్లు నెత్తురు గ్రక్క
చును మరణ బాధచే
సొమ్మలో యెట్లెట్లొ
చొరవ చేసుక హీన
రవముతో పక్షి రా
ఘవునితో నిట్లనియె !

''ఓయి ఆయుష్మంతు
డా ! ఔషధను కొఱకు
అడవి యంతయు వెదకు
నట్లు వెదకుచునున్న

సంతాప మిబ్బడిం
చగ రాము డార్తుడై
బాష్ప పూర్ణాస్యుడై
పొరపైచె ధనస్సు!

వివశుడై పడిపోయి
విహగేంద్రుఁ గౌగిలిం
చుక నేడ్చె బిగ్గరగ
సోదరునితో గూడి.

దుఃఖార్తుడై తనదు
దుస్థితికి వగజెంది
లక్ష్మణుని జూచి రఘు
రాము డిట్లన సాగె-

"తమ్ముడూ! నా వంటి
దౌర్భాగ్యు డుండునా?
రాజ్యమది పోయె! నా
రమణి నొకడు హరించె!
నా కొరకు పోర ఖగ
నాయకుడు చంపబడె!

అనుజ ! నా దురదృష్ట
మగ్నినే దహియించు.
ఒక వేళ నే దూఁక
ఉదధినే శుష్కించు.

అంతె గాకను నేల
యంత బీటలు వాఱు !
అకట ! నా దౌర్భాగ్య
మది యెంత ఘోరమో !

ఏమందు తమ్ముఁడా !
ఏమందు దుర్విధిని ?
ఇది వలదు రావలదు
ఎంత పగ వానికిని !

మన హితుడు మనకు జన
కుని వంటి వాఁడితడు
అనఘుండు వృద్ధుండు
ఆత్మీయు డితడు నా
నిర్భాగ్య దశవలన
నిహతుడై పోయె నిటు !"

అని జటాయువు దేహ
మంతయును దడివి మే
నొడయు నెత్తురు తుడిచి
ఒడిలోన జేర్చుకొని

ముఖమంత కన్నీళ్ళ
ముసురుకొన ఖగపతిని
గుండెలకు హత్తుకొని
కూర్మితో పేర్మితో
గద్గద స్వరముతో
కాకుత్థ్సు డిట్లనియె—

"ఓ జటాయూ! తండ్రి!
ఓ మహాత్మా! చెప్పు
నా సీత ఎక్కడు
న్నది చెప్పు నాయనా!"

అనుచు దుఃఖాతిశయ
మున నేల బడిపోయె
మూర్ఛలో నుండి రా
ముడు తేరుకొని మరల,

"ఓ మహాత్మా! నీ మ
హోపకారము మరువ
శక్యమగునా నాకు
జన్మ జన్మలకైన?

ఓ వీర! ఓ త్యాగి!
ఓ కర్మ యోగి! నీ
ధర్మ నిరతికి భక్తిఁ
తలవంచి మ్రొక్కెదను.

ఓ జటాయూ! తండ్రి!
ఓప గలిగితె చెప్పు
సీత విషయము నీ వి
ఘాత విషయము చెప్పు!

నిను రావణుడు వధిం
చిన విధానము చెప్పు!
నా ప్రాణ సమమైన
నా సీత గతి చెప్పు!

ఎందులకు వాడు నా
ఇంతి నెత్తుక పోయె?
వానికే యపకార
మేను జేసితి చెప్పు!

తను బట్టుకొని పోవు
తరుణంబులో సీత
ఏ మన్నదా మాట
లిపుడు నాతో చెప్పు

చంద్ర బింబము వంటి
సతి ముఖం బపుడెట్టు
లుండెనో చెప్పవే
అండ జాగ్రణి నాకు

ఆ రాక్ష సాధముని
వీరత్వ మెట్టిదో
వాడుండు పురమేదొ!
వాడెట్టు లుండునో !

ఓ జటాయూ ! అడుగు
చున్నాను మాటాడ
గల శక్తి నీ కున్న
పలుకవే ! పలుకవే !

పక్షిరాజా! నిన్ను
పలుమారు వేడెదను
పలుకవే పలుకవే
ప్రతిమాలి వేడెదను

సీత ఏమని చెప్పె
చెనటి యెంతటి వాడు?
వాని వాసంబెచట
వాక్రుచ్చవే తండ్రి!"

అని దీనముగ రాము
డడిగినంత జటాయు
హీన స్వరము తోడ
నిట్లు బలుకగ సాగె!

"గాలి మేఘాలు పరి
కల్పించి చీకట్లు
కమ్ముకొన జేసి ఆ
కాశ మార్గాన నీ
కాంత నెత్తుక పోయె
ఖలుడు మాయలు చేసి
దనుజడగు రావణుడు వాడు.
దక్షిణపు దిశకేగి నాడు.

అడ్డు పడి పోరాడి
అలసి పోయిన వేళ
నారెండు రెక్కలను
నరికి వేసెను వాడు.

సుడి వడుచు నున్న వి
ప్పుడు నాదు ప్రాణములు
నాకళ్ళు తిరుగు చు
న్నవి గిరగిరమ్మనుచు.

ఇక వట్టి వేళ్ల వెం
ట్రుకలు గల బంగారు
చెట్లు గన్పడు చుండె
చెడు సూచ కంబయ్యె!

నా కాయువులు మూడె
నాయనా! ఇక నాకు
ప్రాణాలు బిగబట్ట
బలము చాలదు వినుము.

వింధమనెడి ముహూర్త
మందు ప్రుచ్చిరె గాన
నీ సీత త్వరలోనె
నీకు దొరకును నిజము.

గాలమును మ్రింగి దు
ర్గతి బొంది చచ్చు మీ
నమువోలె రావణుడు
నశియించు త్వరలోన.

నాయనా ! నీవు జా
నకి కొరకు దుఃఖించ
వలదు త్వరలో వాని
వధియించెదవు నీవు,
చింతించ వలదు శ్రీ రామ !
సీత దొరుకును సుగుణధామ !"

అనుచు గ్రక్కెను రక్త
కణ మాంసములు నోట
ఆయువులు బిగ బట్టి
నదువు దప్పుచు నుండ-,

"రావణుడు వాడు వి
శ్రవసుముని సుతుడు వై
శ్రవణు తమ్ము" డటంచు
వివశుడయ్యె జటాయు.

కాళ్లు వెనుకకు చాచె
వళ్లెగిరి పడె, శిరము
నేలబడి పోయె, ప్రా
ణాలు దేహము వీడె.

చేతులను జోడించి
"చెప్పు చెప్పు" మటంచు
రాఘవుండడుగు నా
రాట పడు గుండెతో—

ప్రాణ రహితంబైన
పక్షి రాజు కళేబ
రము జూచి గొల్లు మని
రామచంద్రుండేడ్చె!

కను తెర్ర బడగ దుః
ఖము ద్రింగ లేక ల
క్ష్మణుని తో రాముడి
ట్లను కృతజ్ఞత తోడ

# కృతజ్ఞత

"తమ్ముడూ ! నాకు సీ
తను రాక్షసుండెత్తు
కొని పోయె నను దుఃఖ
మున కన్న మిన్నగా
ఈ జటాయు శ్రేష్ఠు
డిట్లాట బాధించు !

నా నిమిత్తంబితడు
ప్రాణమును రాజ్యమును
త్యజియించి నాడు మన
తండ్రీ యంతటి వాడు
నా నుండి ఆశించె నేమి ?
నా తండ్రి ఈ ఖగస్వామి !

పత్ని కోసము కంటె
పక్షీంద్రు విషయమై
సంతాప మధికమై పోయె !
సైపంగా వశము కాదాయె !

జన కాజ్ఞకొరకు రా
జ్యము వదలి నాడనని
ఘనముగా చెప్పుదురు
కాని ఇతడో మనకు

బంధువా ? కాడు మన
పాలితుడు కాడు మన
జాతివాడా ? కాడు
జీతకాడును కాడు

మన చేత నుపకార
మును పొందగా లేదు
మన వల్ల సహకార
మును గోరగా లేదు.
ఎంత నిష్కామ సేవకుడు !
ఎంత నిస్వార్థ మానసుడు !

ఒక కులస్త్రీని పా
తకు డొకడు చెరబట్ట
అడ్డుపడి ప్రాణాలు
అర్పించి నాడితడు.

ఇతడెంత పుణ్యాత్ము
డితడెంత ధార్మికుడు
ఇతడెంత యారాధ్యు
డితడెంత యుపకారి !

## దహన సంస్కారము

మన తండ్రి వంటి వా
డనఘు డీతడు గాన
మనకు పూజ్యుండితడు
మనకు మాన్యుండితడు

లక్ష్మణా ! వెళ్లు క
ర్రలు తీసుకొని రమ్ము
స్వయముగా దహన సం
స్కార మితనికి సేతు

చితి బేర్చి అగ్ని దరి
చిరి; రక్త బంధువే
పోయినటు లేడ్చి ర
ప్పుడు రామలక్ష్మణులు.

అంత రాముడు "ఓమ
హాత్మా! జటాయువా!
యజ్ఞశీలుర కెట్టి
యహితాగ్నులకు నెట్టి
పుణ్య పురుషుల కెట్టి
భూ ప్రదాతల కెట్టి
ఉత్తమ గతులు గల్గు
నో యట్టి పుణ్య లో
కాలు నీకు లభించు
గాక! అని నీకు నే
దహన సంస్కారము య
థావిధిగ చేయుదును.

ఓ పక్షి రాజేంద్ర!
ఓ జటాయూ! నీవు
ఇక పుణ్య లోకాని
కేగి హాయిగ నుండు!"

అని చెప్పి చితిమీద
ఆ జటాయు కళేబ
రమును జేరిచి అగ్ని
రగిలించి రంతలో—

కణకణమ్మని మండు
కాష్టంబు గని బాష్ప
కణజాలములు రాల
గద్గదమ్మని యేడ్చి
రకటకట! రామలక్ష్మణులు !
ఆత్మబంధువె పోయినటులు !

అపు డన్నదమ్ము లా
అమృతమూర్తి జటాయు
వునకు పిండాది త
ర్పణము లర్పించుటకు

అడవిలో నరిగి వే
టాడి మృగముల చంపి
తెచ్చి మాంసము కోసి
తీసి ముద్దలు చేసి,

ప్రేత కార్య మొనర్చ
లేత పచ్చిక మీద
పిండాలు తగబెట్టి
పితృదేవతాకమగు
మంత్రాలు చదివి ఆ
మహితాత్ముడౌ జటా
యువున కుత్తమ లోక
మొనర ప్రాప్తిల్లగా
పితృయజ్ఞ మొనరించినారు!
ప్రియపుత్రకుల వోలె వారు!

## గోదావరి జల తర్పణము

పిదప గోదావరికి
ఉదక తర్పణ మిడగ
వెళ్లి స్నానాలు గా
వించి రమలాత్ములై

అమృతమూర్తి జటాయు
ఆత్మ శాంతిల్లుటకు
గోదావరీ పావ
నోదకమ్ముల తోడ
తర్పణములను వదలినారు!
తమ తండ్రికిని వోలె వారు!

జల తర్పణాలు చే
తుల నుండియే కాదు
రామచంద్రుని కనుల
రాలె నవిగో చూడు!

సీత నొక రాక్షసుడు
చెఱ బట్టెనను రోష
మెద బాధగా సెలగి
సొదవోలె పగరేగ

తన కడ్డుపడ్డ ప
క్షిని జంపెనను కక్ష
మదికోతగా రగిలి
మంటయై చెలరేగ

శోకతప్తంబైన
శోణితాక్షుల నుండి
ఉష్ణాశ్రు బిందువుల
హా! తర్పణాలయ్యె!

ఆ తీక్ష్ణమైనట్టి
అశ్రుకణములు రాలి
గోదావరీ నదికి
గుండెలో నేటికిని
అగ్ని కుండాలగుచు
ఆవిర్భవించినవి,
ఇది కట్టుకథ కాదురా!
గోదారి
ఎద నుండి వినిపించురా!
వగ పొగలు మూఁగగా
పగ సెగలు రేఁగగా
అశ్రు కణకణములో
అణ్వస్త్ర ముండునట!
గుండె గుండియ నగ్ని
కుండ ముదయించునట!
ఇది కట్టుకథ కాదురా!
గోదారి
ఎద నుండి వినుపించురా!

"తనకై బలియై పోయిన
ఘనుని జటాయువును తండ్రి
గా దలంచి రాముడు పితృ
కర్మల గావించినాడు.

జటాయువే జీవించిన
జన్మాంతం బతని(బ్రీతి
సేవించడె? సర్వము విర
జిమ్మి కృతజ్ఞత రఘుపతి.

తనకు మేలొనర్చిన వా
నిని కృతజ్ఞుడిల మరువడు.
జీవించిన మరణించిన
చిరస్మృతుడు సుకృతి యెపుడు.

కృతజ్ఞతా భావం బిపు
డేదీ యెటు బోయెనయా!
అది కృతఘ్న దావాగ్నికి
హతమయ్యెనా! రసప్రియా!

అవసర మున్నంతవరకు
అడకువతో మెలగుచుండు.
అవసరమది తీరగనే
అగుపించడు కృతఘ్నుండు.

అవకాశము కొరకు వేచి
అది లభించి నంతటనే
ఉపకారికి నపకారం
బొనరించగ వెనుకాడడు.

శ్రీరాముని కృతజ్ఞతా
శీల గాన మాలించిన
కొంతైనా పరివర్తన
కొందరితో రాకపోదు.

అని రథగిరి రాముని స
ద్గుణ గణాల కీర్తించెను
తాకన్నది కన్నట్టు య
థావిధి నాతో చెప్పెను.

గోదావరి కుడి ఒడ్డున
గుట్ట ఒకటి చెపుతున్నది
భద్రాచల సీమ లోన
పర్ణశాల ఒక టున్నది.

శ్రీ రాముండిటకు వచ్చి
సీతను పోగొట్టుకొనగ
ఎద యేరై శోకించిన
దిదే ఇదే ప్రాంత మనుచు ॥గోదా॥

"అదిగో అటు చూడుము నా
కెదురుగ వెలసిన దొక గుడి
'శోక రామమూర్తి' నందు
లోకులు దర్శించు చుంద్రు.

అదిగో అటు చూడుము నా
కారు మైళ్ల దూరములో
దొమ్మి పోరు జరుగుటచే
'దుమ్ముగూడె' మని యందురు.

ధూమజ మన మబ్బుందురు
ధూమ్యాట మనంగ పక్షి
మబ్బులు సృష్టించి ఖలుడు
మహిసుత నెత్తుకు పోవుట,
పక్షి రాక్షసునితో తల
పడి పోరిన కారణాన
దొమ్మి యుద్ధమును తలుచుక
'దుమ్ముగూడె' మని పిలుతురు.

అదె "జటాయు ప్రోహి" గాన
అదిగో! "ఎటపాక" వెలసె.
అట జటాయు ముక్తి బడసి
అమరుడైన గాథ విరిసె.

కలిలో 'తారక రాముడు'
వెలయు నంట ఇచట మహీ
జనావళిని తరియింపగ
జటాయు గుడి వెలయునంట.

'ఎటపాక'కు మిగుల దగ్గ
రే వెలసెను భద్రాచల
మచట భద్రముని రాముని
అచల రూపమున గొలచెను.

"పక్షికి మోక్షం బొసగిన
భక్త పరాధీనా! నా
శిఖరముపై నీ వెపుడు వ
సింపుము నా కదియె ముక్తి"

అని భద్రుడు ఘోర తపం
బొనరించగ శ్రీరాముడు
భద్రుని కోరిక దీర్చగ
భద్రాచలమున వెలసెను.

వామాంకము నందు సీత
వామ కరంబున చక్రము
దక్షిణ హస్తాన శంఖు
లక్ష్మణుండు వామ దిశను.

శ్రీమన్నారాయణుడే
సీతారాముల రూపున
జగమునెల్ల నుద్ధరింప
చతుర్భుజుడుగా వెలసెను."

అని ఇవ్విధి రథపు గుట్ట
అలనాటిది నేటికి తన
సమీపాన నుండు "పర్ణ
శాల" సంగతులు చెప్పెను.

విన్నది విన్నట్టుల నే
వినిపించితి గేయ కవిత.
ఇహ పరార్థ సాధనకై
ఇనకులాబ్ధి సోముని కత.

భక్త పరాధీనుడైన
భద్రాచల రాముని పద
పద్మాలకు 'పర్ణశాల'
భక్తి నొసగి కైమోడ్తును.



# గద్య

శ్రీరంగాపురి ధాముడ
శిష్టావళి విధేయుండ
విశ్వబ్రాహ్మణ కులజుఁడ
విశ్వజ్ఞఋషి గోత్రుఁడ

భోజయాఖ్య పౌత్రుడ సత్
పుణ్య దంపతులు రామాలి
బాజానకి రామార్యుల
ప్రథమ సుతుడ కేశవుడను

నయశీలురు మాధవాఖ్యు
నకు లక్ష్మీనరసాంబకు
నగ్రజుండ గుణవతి కన
కాంబా రమణికి రమణుడ

రవి, విజయశ్రీ, శారద (జయశ్రీ)
రామశ్రీ, రాజశేఖ
ర, శుభశ్రీ, రామలింగ,
రామకృష్ణులకు జనకుడ.

అర్థ గణాంకముల వృత్తి
అయిన కవిత నా ప్రవృత్తి.
వృత్తి నన్ను పోషించు ప్ర
వృత్తి నన్ను తోషించును.



నయబుధ మిత్రుడను 'రస
ప్రియ' బిరుదాంచితుడ, జగ
జ్జననీ జనకులు గౌరీ
శంకరుల భజించువాడ.



ఖమ్మములో వసియించిన
కాలములో దుర్మతి లో
'పర్ణశాల' గేయ కవిత
భక్తి వ్రాసి భద్రాచల
శ్రీ సీతారామచంద్ర
శ్రీ చరణాంబుజ సన్నిధి
కర్పించితి నిహపర సౌ
ఖ్యముల బడసి తరియించగ.

# ఫలశ్రుతి

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ
శ్రీ శ్రీ శ్రీ విజయశ్రీ
శ్రీ శ్రీ శ్రీ సౌఖ్యశ్రీ
శ్రీ శ్రీ శ్రీ కీర్తిశ్రీ
సంపూర్ణారోగ్యశ్రీ
శక్తిశ్రీ శాంతిశ్రీ
బ్రహ్మాయు ర్భాగ్యశ్రీ
పఠియించిన రచియించిన
ఆలించిన వారందరి
కాదరమున భద్రేశ్వరు
డొసంగి ప్రోచు గాత మనుచు
'రసప్రియు'ని కలమే తన
గళము గాగ 'రథగిరి' మం
గళము పలికి దీవించును.
భద్రాచల సీమలోన
పర్ణశాల ఒకటున్నది.
గోదావరి కుడి ఒడ్డున
గుట్ట ఒకటి చెపుతున్నది.
శ్రీ శ్రీ శ్రీ

# తప్పొప్పులు

| పేజీ | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 47. | స్త్వైర | స్వైర |
| 61. | సోనీను | పోసీ[illegible] |
| 67. | బలర్పము | బలదర్పమ |
| 86. | హరిణము | హరణమ |
| 88. | సౌమాన్యమై | సామాన్యజ్ఞ |
| 109. | జేపి | జే |
| 109. | బలిచి | బిలి |
| 115. | కుజును | కుజన |
| 131. | రేదంట | లేదం |
| 136. | నీనావై | నీవై న |
| 137. | పెంపొదవట | పెంపొందవ |
| 145. | కన్కి | కన్కి |
| 148. | నేర్తు రా | నేడ్తు ర |
| 155. | వెదేహి | వై దేహి |
| 165. | వెతజెంతగా | వెతజెందగ |
| 174. | పరునడై | పరుడై |
| 178 | శరాహుతి | శరాహు |
| 181. | యనుభము | యనుభవము |
| 197. | బండునో | లుండున |
| 214. | హస్తైన | హస్తైన |
| 216. | రామాల | రామా |
| 217. | దురి,తి | [illegible] |

# సీతాన్వేషణ

## (కిష్కింధాకాండ)

### రాబోవు గేయ కావ్యం

ంథకర్త: 'రసప్రియ' ఫోతేదార్ కేశవాచార్యులు, బి
గ్రామం: శ్రీరంగాపురం,వనపర్తి తా॥ మహబూబ్‌నగ
్యోగం: ఖమ్మం జిల్లా ముఖ్య ప్రణాళికాధికారి
రుచులు: కవిత్వం, చిత్రలేఖనం, తత్త్వశాస్త్రం,
చరిత్ర పరిశోధన.
సంగములు: క్షేత్ర చారిత్రక సాంస్కృతిక రచనలు
సాంఖికార్థిక ప్రణాళికా గణాంక సమీక్ష



1962
'రసప్రియ' కేశవా[illegible]గం

